# భువనవిజయము

రచయిత:
అనంతపంతుల రామలింగస్వామి
Retd Weaving Superintendent
Govt. Dept of Industries.

Approved by the Andhra University
as Text book for Part II, B. A. Degree Examination 1959
Page 30—129-

అతి నిర్దుష్ట కవిత్వ తత్త్వవిదుఁడై యంభోధి గంభీరుఁడై
ధృతి హేమాచలతుల్యుఁడై సకల ధాత్రీశాదరాన్వితుఁడై
సితసత్కీర్తి విరాజమానదశదిక్సీమాంతుఁడై, హాస్యవా
క్చతురాస్యుండగు రామలింగకవి నస్మద్దేశికుం గొల్చెదన్.

# అనుక్రమణిక



కవిజననము

1 వికృతిశ్రావణ శు॥ ప్రథమ 1–8–1890

2 జన్మస్థలము–పార్వతీపురము

3 భువనవిజయరచన–ఖరవర్షాది

4 ఆవిష్కరణము – జయాషాఢప్రథమ

## ఇతరకృతులు

1 శుక్లపక్షము

2 కవితాంజలి

3 రక్తాంజలి

4 భావగణపతి

5 కథాయుగము

6 శ్రీకృష్ణకవిజీవితము

7 నీతిదూతిక

8 శోధనజ్యోతి

9 గేయములు

10 ధాత్రి

శ్రీరస్తు

# భువనవిజయము

## ప్రస్తావన

మానలినాక్షీ కిమ్మ్మ, సుమ
మాయుతసజ్జనసుందరమ్మ్మ, వా
ణీనిలయమ్మ్మ, శిల్పిశత
నిర్మితమర్గవిభూషితమ్మ్మ, ధ
ర్మానుగతప్రభుత్వపరి
రక్షితసత్పుటభేదనమ్మ్మ, వి
ద్యానగర మ్మొకప్పుడు ప్ర
ధానపుర మ్మఖిలాంధ్రభూమికిన్. 1

అది విద్యానగరం బను
విదితాఖ్యం బరఁగె సకలవిద్యాస్పదమై
పొదలుట; విజయాశ్రయమై
యదిరా! యది విజయనగర మనియు రహించెన్. 2

భద్రసితేతరలోచన
భద్రప్రద, భద్రగమన, భద్రోపమయున్

భద్రసికతానితంబిని
భద్రామల తుంగభద్ర భాసిలు నచటన్. 3

విమలవిరూపాక్ష విరలేశపాదపం
కజరజఃపూతభూఖండ మగుచు
తుంగభద్రానదీ తుంగభంగోద్ధూత
శీతలోదకకణాభిషిక్త మగుచు
శరసారమేయశశ్వజ్జన్యవిఖ్యాత
వీర్యగాథావాదివేశ్మ మగుచు
మాన్యవిద్యారణ్యమాధవాచార్య ని
ర్మాణకౌశలరమారమ్య మగుచు
సకలసమ్యక్కళావిలాసమ్ము నగుచు
మహితవిద్యానగరనామమాన్య మగుచు
నమరు నమరపురమ్మునునైన నగుచు
విజయనగరమ్ము విదితదిగ్విజయ మగుచు. 4

పటునాద్యుపలఫలకసం
ఘటితాచలరాజి, దూరగతగిరినివస
ద్భటతాడితరవ మన్నిట
స్ఫుటమై చని వైరిరాకఁ బురికిన్ దెలుపున్. 5

అసితోన్నతప్రస్తరాకీర్ణకుధరాళి
పూర్వపశ్చిమదిశాభూమిఁ దనర
రామదుర్గాగాఖ్యరమణీయగిరిరాజి
దక్షిణదిక్సీమ రక్షగాఁగ
తుంగభద్రాతుంగభంగాళి, తుంగాళి
యుత్తరదిక్కున నత్తమిల్ల
గిరిసమున్నతశిలాపరికల్పితాతత
కుడ్యభాగంబులు గోమరుని:—ఱ
సహజపర్వతవరదుర్గసామ్య మంది
బళిర! ప్రాకారసప్తకపాళి నొంది
భూరిశత్రుభయంకరాకార మొంది
యొసఁగుఁ బురదుర్గ మద్భుతోల్లసన మంది. 6

ప్రాకారాంతరభూములం దొకట సే
వ్యం, బొంట వాణిజ్యమున్
మాకందాదివనంబు లొక్కయెడఁ, గ
ర్మాగార మొండొక్కచో
హూకల్ చేసెడి టంకసాల యొకచో
రోగాపనోదక్రియా
స్తోకాగారము లొక్కచో వెలయు, జో
దుల్ ప్రాలఁ గొండొక్కచో. 7

హరిహరరాజచంద్రునకు
నాప్తగురుండగు మాధవార్యుఁ డా
పురమును దుర్గ మొక్కటియొడఁ
బోలిచిచూపి ఘటింపఁజేసి, యుం
దరవుగఁ గీర్తికాంత వసి
యింప నపూర్వమహాంధ్రరాజ్యమున్
నెలుపఁగఁ జేసె మున్ను ధర
ణీధవకర్తృకతాపిభూతిమై. 8

సాయణాన్వయసుధాతోయధిచంద్రుండు
భారతీమార్గప్రచారకుండు
సకలవిద్యాసారసంగ్రహదక్షుండు
వేదభాష్యరచనా విశ్రుతుండు
వైదిక లౌకిక వ్యవహారధుర్యుండు
రాజ్యనిర్మాణకర్మప్రియుండు
మాతృదేశాంబికా మహనీయభక్తుండు
సహజస్వధర్మ సంస్థాపకుండు
జైనపాషండయవనాది శత్రునిహత
వైదికమతప్రతిష్ఠాపనాదిగురుఁడు
సప్రతిగ్రహదీక్షావ్రతైకపరుఁడు
మాధవాచార్యుఁ డనుపమామాత్యవరుఁడు. 9

గణ్యుఁడు, మాధవవిద్యా
రణ్యుఁడు, బుధమాన్యుఁడు, గుణారణ్యుం, డుద్య
త్పుణ్యాకృతిశతవిరచనా
పణ్య మతసుచరిత మాంధ్రపౌరుల కెల్లన్. 10

కొండొకనాఁటి కాపురి న
ఖండితపద్ధతి నేలవచ్చె, మా
ర్తాండసమానతేజుఁ, డరి
రాడ్గజసింహుఁడు, కృష్ణరాయఁ డా
ఖండలవైభవుం, డమిత
గౌరవభాజనుఁ, డుత్తమోత్తముం
డెండకు వాన కోర్చిన మ
హీపతి యాంధ్రుల భాగ్యమూర్తియై. 11

ఆవిద్యానగరమ్ము రాయలు సమ
స్తైశ్వర్యనిస్తంద్రతే
ఖావాసం బనున ట్లొనర్చె శతల
క్ష లోక్వాసి, ప్రాధాన్యదే
శావాసుల్ సయితంబు లిచ్చువడఁ ద
త్సౌందర్యసౌభాగ్యశో

ఘానై శాల్యజనాభివృద్ధి పరిశు
భ్రత్వాదు లీక్షించుచున్. 12

వాస్తుశాస్త్రానుభవజ్ఞాననిష్ణాత
శిల్పినిర్మితహర్మ్యకల్పనములు
నన్యదేశానీతజన్యోపకరణాది
శస్త్ర వస్తుప్రదర్శనగృహములు
నాతత సైన్యవిన్యాసస్థలంబులుఁ
జతురఖేలారంగశాద్వలములు
రంగారుముత్యాల రంగవల్లులుఁ జల్వ
పందిళ్ళుఁ జెల్వారు ప్రాంగణములు
నేలయీనినచందానఁ గ్రాలు ప్రజలు
దివ్యవైభవమునుజూపు దృశ్యతతులు
శ్రావ్యమంగళరవ యుక్ప్రసన్నదిశలు
విజయనగరరమాదేవి వింతనగలు. 13

మైనమువిూఁద మాదిరి న
మానకఠోరశిలాతలంబులన్
సానులనాట్యముల్ సుభట
సైన్యము, వన్యమృగాదిజీవులన్

మహానుల మల్లురన్ మలచి
మాన్యతనొందిన శిల్పిశిల్ప వి
జ్ఞాననిధానమై పురము
స్వర్భువనప్రతిమానమై తగున్. 14

తనసత్యత్వము, వ్యంగ్యభావమును, వై
దగ్ధ్యంబుఁ దివ్యంబువా
యని యౌచిత్యము, రామణీయకము, శ
య్యారీతులం జూపుచున్
మనుజాళిం గని పల్కరించును, నగున్,
మాటాడు, నాట్యాడు, నిం
దనిమేషస్థితి శిల్పసుందరి కళా
వ్యాపారపారీణయై. 15

ప్రకృతివిలాస మేదొ, ప్రతి
భాన్వితమానవకౌశలం బెదో
ప్రకటనివిక్తి చూపఁబడుఁ
బొల్పడ దానగరంబునందుఁ; ద
ద్వివ్యక మగజేశయుగ్మమటు
దివ్యకళామయభవ్యరూపమై

యొకటిని మించి యింకొకటి
యుజ్జ్వలదీప్తినిఁ బంత మాడుటన్. 16

తిన్ననివీథు లద్దముల
తీరున నీటుగ నుండు, మేడలో
మిన్నులు నంటు, నం దనుని
మేసము వచ్చుచుఁ బోవుసత్ప్రజా
భ్యున్నతి మెచ్చవచ్చు, నల
ప్రోలికి వస్తువు లందఁజేయు నా
చిన్నిగుణాల నేస్తుల వి
చిత్రవృషంబులఁ జూడ వేడ్కయా. 17

ఘంటాయుగ్మము పార్శ్వభాగముల రం
కారమ్ములన్ సల్ప, నిం
టింటన్ బండ్లను బాలబాలికలు సం
డింపంగఁ గైకొంచు, మి
న్నంటం గాంతులు నించుభూష లురుదే
హంబందు రాజిల్ల; నూ
ర్వొంటం బట్టపు భద్రకుంజరము గ్రీ
వం బోవు సంధ్యాద్వయిన్. 18

అలముం దన్నగరిన్ శిలాపుటితను
ల్యల్ దుంగభద్రానది
జ్జలప్రాకమ్ములనుండి హాలికులు స్వ
చ్ఛందమ్ముగా సేద్యముల్
సలుపన్, పౌరులు స్నానపానముల ని
చ్చాలీలఁ గావింపఁగాఁ;
గలదే జీవనసౌఖ్య మిట్టు లెట నే
గ్రామంబునం దేపురిన్ ? 19

కలరటదండజాతకృత
గానసమానమయూరనాట్యముల్
కలితవిహారయోగ్యములు
క్రమనిరాతపనిస్తుల స్థలుల్
లలితలతావితానసువి
లాసలతాంతనితాంతకాంతముల్
ఫలభరనమ్రపాదపని
వాసము, లప్పురకేళికావనుల్. 20

రమణీయనవరాగరంగద్ద్యుతు లెసంగ
నొకకొమ్మఁ బల్లవప్రకర మార

సుమనోఽనురంజక సూనసంతానమ్ము
వాసించి, యొకకొమ్మ వాసిమీఱ
గరుడపచ్చలచాయఁ గలశలాటువు లొక్క
కొమ్మ సొమ్ములుగాఁగఁ గొమరుమేర
ననుపమానసుధారసాపూర్ణ ఫలజాతి
యొకకొమ్మరుచు లూర నొప్పుగూర
సాలుపొడుగునఁ జివురించి పూలుపూచి
కాచి ఫలియించి కల్పకకల్ప మగుచు,
ఫలసమావాప్తి శ్రితులకుఁ గలుగఁజేయు
మహితసురసాల మిట "బారమాసి" పేర. 21

వాడలఁ బార్శ్వసీమలఁ బ్ర
భాకరతాపమువాపి చల్లఁగా
నీడలు నించి మించునవ
నీజము; లప్పురి దేవళంబులో
వాడకువాడ కొక్కఁడుగ
భాసిలు సంతత రాగభోగముల్
గూడినవేల్పు లందొసఁగఁ
గోరినకోర్కులు భక్తకోటికిన్. 22

అంచు "హజారరామవిభు"
నాలయమండపసీమలం బ్రభా
సుందరశిల్పరూపపరి
శోభితరామకథావిధాన మా
నందముఁ జిందుఁ జూపఱ క
నారత, మూర్జితభావశోలికా
మందపహారహారిబుధ
మానితమానసవృత్తిఁ గూర్చుచున్. 23

ఏకశిలావినిర్మిత, మ
హీనరుచిస్ఫుట, మాయతోన్నతం
బాకృతిభీకరంబు, బర
మాద్భుతశిల్పకలావిలాసను
శ్రీకలితాంధ్రనాగరక
చిహ్నము పీరనృసింహదైవత
ప్రాకటవిగ్రహం బొకఁడు
భాసిలుఁ దన్నగరాంగరక్షయై. 24

ఉదయగిరిం జయించి, విజ
యోన్నతి చిహ్నముగా గ్రహించి, తేఁ

ఽదిర ! ప్రతిష్ఠ సల్పిన త
దాలయ సంస్థిత కృష్ణవిగ్రహం
బదవదసేయుఁ బ్రేక్షక దృ
గాళిని నైజమనోజ్ఞశిల్పసం
పదవలనన్ సజీవకళ
భాసిలుఁ దన్ముఖమండలాకృతిన్. 25

పణ మెంతో వెదచల్లి, శిల్పసుకళా
బ్రహ్మశ్రీ రావించి, తా
రణయాత్రాదిని నర్చకై విభుఁడు ని
ర్మాణంబుఁ జేయింపఁ ద
న్నణురూపాధిగణేశ్వరుం డని జనుల్
హాస్యోక్తులం బల్కఁగా
గణనాతీతశిలాకృతిం దనరు వి
ఘ్నస్వామి శత్రుఘ్నుఁడై. 26

ప్రాకటచారుదారురథ
భంగిని నిర్మితమై, నిరూఢమై
శ్రీకర శేముషీవిభవ
చిహ్నము నై, యతిసూక్ష్మశిల్పశో

ప్రాకారమై, యశేషహృద్య
యంగమమై, బహుభావిచిత్రమై
యేకశిలారథంబు విఠ
లేశ సమీపతలాన భాసిలున్. 27

నినదించును స్వరసప్తక
మును ఆకంబంబు లేదు ముఖమండపమం
దనుపమ శిల్పకళా భా
జనమై నగరమ్ము దోఁచుఁ జక్షుర్మహమై. 28

అలహజారమునందు వెలయు రామస్వామి
తేరిపై దిద్దిన కాఱుబొమ్మలు
విఠలాలయోపాంత విమలవేదికలందు
పాలమీఁగడ గారపనిపసందు
గురునారసింహ వక్షోభాగ నిక్షిప్త
రక్తచందన కనద్రమ్య రేఖ
నగరభాగ్యవిధాతయగు విరూపాక్షేశు
కమనీయకర్బుర కాంతిపటలి
శాణకల్పిత యోధాగ్రసరుని నయన
యుగళి ననలార్చు లీనెడి తొగరుచాయ

లాంధ్రజన చిత్రశిల్పవిఖ్యాతిఁ జాటు
వేయినోళ్ళను దశదిశావీధులందు. 29

ఆణిముత్తెపుముగ్గు లలమునీలపు టరుం
గులచెన్ను మున్నీటిగోము నాఁపఁ
జిన్ని వన్నెలు చిందు చెందొవరాటాతి
నిద్దంపుగోడలు నీటుఁ జేపఁ
బసిఁడి కంబములపైఁ బచ్చటాడీఁగెల
నటియించు రాయంచతుటుము దోఁప
ముసిముసినగు జంత్రపుంబొమ్మ లందంపుఁ
గిన్నెరల్ మీటు 'భంగిములు' చూపఁ
గడు నిగారంపు వెండిబంగారు గూళ్ళ
వంబుమీాటెడు పలుపావురంబు లొప్ప
మెఱయు మానవకౌశల మేదురంబు
రాజభవనంబు నగరనీరాజనంబు. 30

ఆలయపాళి, దేవళము
లందుఁ, దదంతికగోపురాళి, ను
ద్వేలసరస్తటంబుల, న
దీనికటోర్విని, సౌధరాజిముం

దోలగమందు, శిల్ప విభ
వోన్నతి నారసి దేవశిల్పు లీ
నేల నలంకరించి రను
నిర్ణయముం బొనరింత్రు యాత్రికుల్. 31

అల మాతంగనగాగ్ర మెక్కి ప్రతి సా
యంసంధ్య నేత్రోత్సవ
లలితారామములన్ గజాశ్వములఁ గు
ల్యాజాలమున్, సౌధ పా
ళుల, దేవాలయకోటి, గోగణనదీ
రూపాదిసర్వంబుఁ గ
న్నులపర్వంబుగ నెంచి చూచి జన మెం
తో సంతసం బొందెడున్. 32

ఆపుటభేదనాశ్రయము
లందముచందము; లందుఁ గాంపురం
బేపగు పాలవెల్లి నుద
యించిన కన్నియకన్న మిన్నగాఁ
బూపమొయారముల్ పసిఁడి
పూంత నిగారము లాలి నవ్వు వా

ల్జూపులు, తీపుఁబాఱు నుడు
లుం గల మన్నెపుఁ బువ్వుఁబోండ్లకున్. 33

మరువంబున్ దవనంబు సర్వసుమనో
మాలాసహస్రంబులన్
సరసాలాప విలాసహాసములచే
సారంగ సౌభాగ్య భా
సురపీఠాదులచే వెలర్పనిచి, త
త్సూనేచ్ఛలో వారి కా
పురమం దమ్మెడుపుష్పలావికల నే
ర్పుల్ వర్ణనాతీతముల్. 34

బలవద్రీతినిఁగాక స్వేచ్ఛను జతు
ర్వర్ణప్రజల్ నైజవృ
త్తులలో నిత్తెము సప్రమత్తులయి సం
తుష్టాంతరంగాళితో
నెలమిం జాటెడు స్వాదుభాషణముతో
నేతత్పురీకీర్తి వ
ర్ధిలున ట్లాత్మవిధుల్ ఘటింతురు గుణ
స్థేమాభిరామస్థితిన్. 35

ప్రాతర్వేళను స్నానసంధ్యలను ని
ర్వర్తించి, దేవార్చనల్
ప్రీతిం జేయుచు సత్కరించి యతిథి
శ్రేణిన్, మనీషాగుణ
స్ఫీతాధ్యేతల కాత్మవిద్యఁ గఱుపా
సి న్నేర్పు ధాత్రీచర
ద్ధాతల్ దత్పురి నగ్రజన్ములు సదా
ధర్మైకనిష్ఠాపరుల్. 36

బండల్ మీటి సవారిఁజేసి గుఱిగా
బల్లెంబులన్ గుప్పుచున్
దండల్ ద్రిప్పుచు సామునేర్చి నది నీఁ
తంగొట్టి విల్ పట్టుచున్
జఁడాయోధనమర్మకర్మముల నో
జ న్నేర్చి వజ్రప్రభో
ద్దండోద్దీర్ణశరీరులై మనెద రా
ధాత్రీస్థలిన్ క్షత్రియుల్. 37

దేశవిదేశవస్తువులు
తెప్పునఁదేలు బజారులందు న

త్యాశలు లేక వైశ్యవరు
లమ్ముదు రంగమూఁను నన్నిటిఁ
రాశిగఁబోసి వారు నవ
రత్నము లమ్ముటఁ జూచి యద్భుతా
వేశులుగారె యవ్విపణి
వీథులఁ జూపఱు తత్పురంబునన్. 38

హాలము కలమ్ముగాఁగఁ బోల
మంతయుఁ బొత్తముగాఁగ నాకృషీ
వలుఁడు గవీశ్వరుంబలె సై
బా సననైన సువర్ణ సస్యమున్
గొలిపి ప్రజోపయోగమును
గోరుచుఁ దత్ప్రకృతిన్ భజించు; గా
గిలికవ లౌఁగదా ప్రకృతి
దేవికిఁ గర్షకుఁడుం గవీశుఁడున్. 39

ప్రతిసాయంసమయంబునందు నగరో
పాంతోర్విపైఁ గూడు న
ద్భుతమానంతను విక్రయించు జనసం
దోహంబు వస్త్రంబులన్

లతలం బూవులఁ బండ్ల దారువులఁ బా
లన్ బక్షులం బాత్రలన్
జతుకంబున్ ఘృతముం దధిన్ బశువులన్
శస్త్రంబులన్ ధాన్యమున్. 40

భూరికాకోదరవారంబు నాడించు
సహితుండికుని నేర్పు నరయువారు
పరిధిసూపప్రజావర్గాక్షులం గప్పు
నైంద్రజాలికుశక్తి కలరువారు
సంగ్రైన గంగడోల్యుంగాళ్ళఁ జీరాడు
గంగిరెద్దులఁ జూచి పొంగువారు
కలజానపదగీతికలు పాడి యలరించు
దాసరులం జేరి తనియువారు.
పుష్పలావికలన్ డాసి మురియువారు
తెరువుతప్పినబిడ్డల నరయువారు
చెలఁగి క్రయవిక్రయమ్ములు సేయువారు
జనము లాప్రోలివింతైన సంతలోన. 41

చోరభయమ్ము లేదేచటఁ
జూచినఁ దత్పురి నేరెవస్తువే

దారిని జాఱి దానిఁగొని
తస్కరణంబొనరింప కంద ఱా
యూరను బౌరరక్షణ ని
యుక్తున కొప్పగ నప్పగింతు; రీ
తీరగు మన్కి నాగరక
దేశములం బెటనైన నున్నదే? 42

కరులా వందలు; వేలు గుఱ్ఱములు, ల
క్షల్ యోధవీరుల్, రథో
త్కరమా లెక్కకుమీఱు; నిట్లు చతురం
గశ్రేణి యెల్లప్పుడున్
దురముం జేయఁగ సిద్ధమై నగరమం
దుం గ్రాల సామంతరా
డ్వరు లాసైన్యముఁ బెంచుబాధ్యతను ని
ర్వర్తింతు రుత్సాహులై. 43

వసరాపండువులందుఁ జూడఁదగు నే
తత్పట్టణప్రాభవం
బసిధారావ్రతదీక్షులన్ నయనప
ర్వాలంకృతిన్ బ్రోత్సవ

ప్రసరంబున్ గపిగాయకాఢ్యవిసర
ప్రజ్ఞావిశేషంబులన్
శ్వసనాతిత్వరితోత్తమాశ్వవిచర
త్సామంతరాట్సంతతిన్. 44

అనుపమమిత్రమ్మును రా
జును ధర్మోత్తేజనము విశుద్ధామృత జీ
వనమును ఘనసంతానము
దనర న్నగరంబు సత్పథం బన మెఱయున్ 45

పురము పుటభేదనం, బాత్మ భూవరుండు
నగర మాదర్శ, మవనీంద్రుఁ డగును బింబ
మనఁగ నన్యోన్యవిభవసమాశ్రయమున
విజయనగరమ్ము రాయలు వెలయనయ్యె. 46

జనకసమానుఁడై కుడిబు
జం బయి రాయల కగ్రమంత్రియై
యనుపమధీయుతుం డయి ని
రర్గళుఁడై యసహాయశూరుఁడై
యనితరసాధ్యుఁడై యహిత
హస్తిఘటోగ్రమృగేంద్రుఁడై యశో

ధనుఁడయి క్రొలుతిమ్మరుసు
తద్జ్ఞుఁడు తా నుచితజ్ఞుఁ డెంతయున్ 47

సాళువాన్వయదుగ్ధసాగరరాకాసు
ధాకరమూర్తియై తనరె నతఁడు:
లచ్చమాంబాసతీ రామయామాత్యవ్వరు
పుణ్యదంపతుల సత్పుత్రుఁ డతఁడు;
మును మాధుకరవృత్తిఁ జని బుద్ధిబలముచే
సామ్రాజ్యమంత్రియై సాగె నతఁడు;
స్వయముమాంక సైన్యాధిపత్యంబు వహియించి
కొండవీటిని గొల్లగొట్టె నతఁడు;
దానశాసనవిలసిత శాసనమితి
నిఖిలసామ్రాజ్యసీమను నిలిపె నతఁడు;
రాజదిగ్విజయైకకారకుఁ డతండు;
తిమ్మరుసుమంత్రి యతఁడహో! దివిజమంత్రి! 48

ఆలమునందు నాలయము
నందున నోలగమందు మంత్రి భూ
పాలున కండగా నిలచి
భండనమంత్రణముఖ్య సద్విధుల్

బాలనసేయుచున్ స్వసుఖ
 వర్తనలం దిగనాడి సర్వథా
మాలిమి నుండ రాజ్య మన
 మానయశోవిభవంబు నొందదే? 49

పరరాజోత్కరబంధనమ్మె, విబుధా
 వాసంబు, రంభానటీ
హారిణీరంగము, సద్ద్విజేప్సితఫలో
 ద్యన్నందనం బింద్రనుం
దరవాసంబుఁ, గళాపిపాసితరసా
 ధారప్రపా సీమయుం
బరమానందదమైన తన్నగరముం
 బాలించు రా జున్నతిన్. 50

కలితసారస్వతకలశాబ్ధివీచుల
 నెలమితోఁ జెలిమితో నీఁది యీఁది
ఘనమల్లయుద్ధరంగస్థలోపరి మేటి
 మల్లురతోడుత మలసిమలసి
దండభోగాసంహతాదిసర్వవ్యూహ
 భిద్రహస్యంబులు వెదకివెదకి

రాజకీయరహస్యరాజితజ్ఞానంబు
విజ్ఞులసంగతిఁ బెనిచి పెనిచి
యాత్మజనపాలనాసేవనానురోధ
సకలసాధనసామగ్రి సంతరించి
రాజ్యరథగామి యగుచుండె రాయ లంత
ప్రజలు శ్రీకృష్ణుఁ డని తన్నుఁ బ్రస్తుతింప. 51

స్తుతమతులైన యాంధ్రకవి
సూరు లమాత్యులు శిల్పకల్పనా
చతురులు గాయకాగ్రణులు
సన్నుతనాట్యకళావిలాసభూ
షితసుకుమారవారవిదు
షీమణు, లాశ్రితరాట్కుమారు లా
క్షితిపతి గొల్వుకూటమును
జేరి రహించుటఁ జూడ వేడ్కయౌ. 52

రాయలకొల్వుకూటము ధ
రావర దిగ్విజయైక చిహ్నమై
శ్రీయువతీ సరస్వతులు
సేరి బరాబరిఁ బంతమాడు గో

భాయతనమ్మునై, సుమస
మంచితచిత్రవనీపరీవృతం
బై యతిలోకసుందరము
నై హరువందెడు నేత్రపర్వమై.

కమనీయనవరత్నఖచితజాంబూనద
భద్రాసనాసీనపతియుతంబు
అష్టదిగ్గజసమాఖ్యాతసత్కవిగురు
మంత్రి శిల్పిబ్రహ్మ మండితంబు
జగదభిమోహన సంగీత నాట్యసా
హిత్య సాహిత్య సమీడితంబు
భక్తియుక్తప్రజాబాంధవభటఘటా
సామంతరాజాభిసంవృత**తెలు**,
భిత్తిగతదర్పణ ప్రతిబింబితోరు
శిల్పసంగతబహుసభాచిహ్నితంబు **మోదు**
విశ్వవిద్యావిజయిపరివేష్టితంబు **లేది...**
'భువనవిజయంబు' భువనవిభూషణంబు. 54

పరిఫుల్లచంపకోత్పలమాలికాజాల
రమ్యసమ్యగ్రమాలంకృతంబు

సముచితమత్తేభ శార్దూలభూషిత
ప్రాకారనిర్మాణపరిణతంబు
తతసుధామాధురీయుత గీతికాప్రభూ
తానందరసలసితాస్పదంబు
గురువితానవ్యాప్త సురుచిరతరకంద
సందోహచర్చాతి సుందరంబు
సీసకమ్ముల బహుధావిభాసురంబు
నాటవెలఁదుల గతికళాభ్యంచితంబు
భావదీవ్యదలంకార బంధురంబు
భువనవిజయంబు భువనవిభూషణంబు. 55

ఆ యతిలోకసుందర స
భాయతనంబునఁ గొల్వుసేయు శ్రీ
రాయఁ డనూనజీవనని
రంతరసంచరణప్రవీణలీ
లాయుతరాజహంసగతి,
రమ్యరుచిస్ఫుటతారలందు రే
రాయనిపోలికన్, విబుధ
రాజిసమాశ్రితరాజువై ఖరిన్. 56

క్షితిభర్తయుఁ గృతిభర్తయు
నతులితకృతికర్త, వైరిహర్త, ప్రజాస
న్నుతవర్తియు, ధృతికీర్తియు
ధృతిసంపన్మూర్తి కృష్ణదేవనృపతియే. 57

మండితకవిగండపెండేరముంగొన్న
పెద్దనామాత్య కవిప్రభుండు
నసమానవసుసూక్తి లసదుత్తమగ్రంథ
మునురచించిన భట్టుమూర్తిసుకవి
ముద్దుపల్కునఁ దన కుద్దిలే డనుపేరు
గొన్నట్టి ముక్కుతిమ్మన్నసుకవి
యతులితమాధురీయుతకవితాకళా
ఘనుఁడైన ధూర్జటికవివరుండు
రామభద్రాఖ్యుఁ డయ్యలరాజసుతుఁడు
ప్రథితసూరన మల్లన రామలింగ
కవుల సేవించి పోషించి కవనకలశ
వార్ధి నోలాడు శ్రీకృష్ణపార్థివుండు. 58

పురి నధ్యేతల పాఠ్యపుస్తకములన్
భూగోళ విజ్ఞానత

త్పరుఁడై వందలువేలసంఖ్యను సదా
ప్రాయించి యవ్వాని నం
దఱకుం బూనికఁ బంచియిచ్చి బహు వి
ద్యావ్యాప్తిఁ గావించు ; నీ
కరణిన్ ధర్మము నిర్వహించు విభు లే
కాలంబునం దుండిరే ? 59

ప్రఖ్యాతాంధ్రసత్కవిప్రత్యేకశక్తి కృ
తావధాన కళావిధానమందు
పరదేశపండితనిరతసంస్తుతిజాత
పూత కర్ణాటసంగీతమందు
రూచిపూరితపురప్రజాచితభరత నా
ట్యకళాప్రదర్శనోద్యమములందు
విప్రవినోదిదిగ్విభ్రమాద్భుతలస
ద్విద్యావినోద సద్వేషులందు
నాంధ్రసామ్రాజ్యలక్ష్మీవరాంకసీమ
మురిపెముల్ ముద్దు లీనుచుఁ బెరుగు కళల
మునిఁగి తేలెడు శ్రీకృష్ణభూధవుండు
స్వప్రజావళినడుమ దర్బారులందు. 60

ఆనృపు నాననేందు దర
హాసనవాంకురదర్శనార్థమై
పూని విదేశవాసు లటఁ
బోయి దినమ్ములు వారముల్ దదా
స్థానముఁ జేరఁ గ్రుమ్మరి తు
దం దరిసించి కృతార్థులై నిజ
స్థానము లందఁ జూతురు స్వ
జాతికిఁ జాటఁ దదీయగాథలన్. 61

'మధురాపురీరాజ్యమండలి నిడు విశ్వ
నాథున కథపుఁ డీనాఁట' ననుచు
'పెద్దన్న డాకాలఁ బెండేరముం గూర్చు
సీనాఁడు కృష్ణభూజాని' యనుచు
'ధూర్జటి కవన మాధుర్య మర్మ సమస్యఁ
దేలుచు నేఁడు భూపాలుఁ' డనుచు
'కవి రామలింగ విఖ్యాత భావతురంగ
చిత్ర మీనాఁడు వీక్షింతు' మనుచు
నవనవోన్మేష దుత్సాహనివసనాత్మ
నందితజనాళి వెసలు దై నందినమ్ము
విజ్ఞులను గన వింతలు వేడ్క లరయఁ
గలితరాజసభాశుభాగారమునకు. 62

# ప్రతిజ్ఞ

ఆకాలంబునఁ గృష్ణరాయఁడొకనాఁ
డాశ్చర్య కృద్వైభవ
శ్రీకల్యాణరమావినోది యగుచుం
జెల్వారఁ గొల్వుండ, ని
ర్భీకప్రక్రియ రామలింగకవియున్
శ్రీవైష్ణవాచార్యుఁడున్
పీఁకన్ వాదములాడి రంతట మతా
వేశాతిరేకంబునన్. 63

నిఖిలేశ విమల పన్నీరజధ్యాన ని
ష్ఠాకార్యధుర్యు లాచార్యు లొకట
ననివార్య సిద్ధాంతఘనతరకర్కశ
బహుశాస్త్రవిదులు విద్వాంసు లొకట
నాటకకావ్యాదినానావిరచనాగ
రిష్ఠులౌ సత్కవిశ్రేష్ఠు లొకట
నాట్యసంగీతాభినయచిత్రలేఖన
విద్యానవద్యులౌ వెలఁదు లొకట
మంత్రు లొకచోట నొకట సామంతనృపులు
వారు లొక్కెడ భాసిల్లఁ బార్థివేంద్రుఁ

డగలు సాంబ్రాణిధూపము లుబ్బుగులుకొనఁగ
"భువనవిజయ" సభాసీమమున వసించె. 64

జైనులు వైష్ణవప్రజలు
శైవులు యూనులుఁ గ్రైస్తవుల్ మత
ధ్యానముఖ ప్రవృత్తినిహి
తక్రియ నుండిరి కాని, పాలసం
ప్రదాన హాలాహలోదయవి
ధాన జనించె మతాహితత్వవై
శ్వానరకేల లానగర
వైష్ణవ శైవసమాజకంబులన్. 65

రా జురువైష్ణవుం డయి వి
రాజిలుచుండుటఁ, గొన్ని యేండ్లు ఘో
రాజు లొనర్చు వైరినగ
రాంతరసీమల కేగియుంట, శ్రీ
రాజమతమ్ము శైవజన
రాజి గ్రహింపఁగఁ జేయఁ జొచ్చి ర
వ్యాజము గాఁగఁ దీవ్రబల
వద్విధి వైష్ణవేషు లప్పురిన్. 66

'శైవము మోక్షదంబు నర
జన్మల' కంచు నొకండు, నొక్కఁ "డా
శైవము కాదు మోక్ష మిడఁ
జాలెడు, వైష్ణవమే" యటంచు, మే
ధావి కవీశ్వరుండు నుతు
తద్జ్ఞుఁడు వైష్ణవదేశికాగ్రగుం
డీవిధి వాదమాడఁ్కొని
రెంతకు నంతము లేనివంతునన్. 67

తాతాచార్యుఁడు రామలింగకవియుం
దా రిట్లు వాదింప వి
ఖ్యాతిన్, బర్యవసానమొందమిఁ గవీం
ద్రారాధ్యుఁ డాకృష్ణభూ
నేతన్ దిగ్గనలేచి చూచి యిటు ని
ర్ణిద్రాస్యరాగాంకురా
న్వితుండై యనె నంతటన్ గిరిఝరీ
వేగాతిగాలాపుఁడై. 68

శ్రీశపదార్చనాశ ! ఖల
హృద్యమునాగ్రజపాశ ! సత్కళా

శేశ ! కవీశ ! యాంధ్రకవి
బృందపితామహాసత్ప్రబంధల
క్ష్మీశ ! సమ స్తమూర్ఖజన
శృంగికనత్కులిశా ! యమూల్య సం
దేశ ! యశఃప్రకాశ ! పర
దేశమహీశమతంగజాంకుశా ! 69

ధృతి నామ్నాయములందుఁ బూతభగవ
ద్గీతాకృతిన్ మానిభా
షితసర్వోపనిషద్వితానమున, బ్రా
చీనప్రబంధంబులం
దితిహాసంబులఁ దత్పురాణములయం
దెన్నోప్రమాణాలు చూ
పితి, నాచార్యులవారివాదమును ని
ర్వీర్యంబుఁ గావించితిన్. 70

కాని, తాఁ బట్టుకుందేటికాళ్ళు మూఁడ
యనుచు వాదించునట్టిమహాత్ముఁ డాతఁ;
డతనిఁ గాదనువాఁ డొక్కఁడైన లేఁడు
పదుగు రుండిన యీసభాభవనమందు. 71

క్రిందఁబడినను మీఁదనే యుండు ననుచుఁ
గులుకుప్రత్యర్థి కోటమిఁ దెలుపఁదలమె ?
విననివానికి వినిచెడు వెరవు గలదె ?
నిదురనటియించునరు లేప నేర్చు నెవఁడు ? 72

గుఱితప్పి గుండు పోవఁగ
వెరవేది తుపాకిఁ దిరుగవేయుచుఁ గొట్టం
బరుగిడునరునటు లాతఁడు
పరిహాసితుండౌచుఁ జేయువాదము వింటే ! 73

"కవి యేడనో, మత మేడనో,
కవికిని మతమునకు నడి నగాధం బెనఁగున్
గవి మతముఁగూర్చి యాడుట
పవిత్రకీర్తిని జీల్గుబెండు వలుకుటగాదే ? 74

కావ్యరచనార్హతయె ఋషికానివాని
గొప్ప దన మతచర్చ యె ట్లొప్పుఁ గవికి ?
ఉట్టి కెగురంగలేనిది యెట్టు లెగురు
స్వర్గమున కన్నసామెత సాటిగాఁగ. 75

కొండ నరసి మెండి గండున డీఁకొన
మొండి నెత్తి పగులకుండ నున్నె ?

కొండమెండితంట మెండిగండమె తీర్చుఁ
గొండ కొండుచేటుఁ గూడకుండు." 76

ఇప్పగిదిఁ జెప్పి, చప్పునఁ
దప్పించుకపోవఁజూచుఁ దాతాచార్యుం
డప్పా! ముప్పున నిసుముం
గుప్పను దలఁదాఁచునిప్పకోడికి సముఁడై. 77

కేవలకవినే నేనఁట!
యీ విష్ణుం డాతఁడంట; యతఁ డెఱుఁగని దొం
డీ విశ్వమందు లేదఁట
శ్రీవైష్ణవమాయ నేమిసెప్పుదు, భూపా! 78

తాతాచార్యుఁడు మతమును
ఖ్యాతిగఁ దాఁ గుత్తకొనెనె? కవి కొసలేదే?
భూతలమానవకులసం
జాతుల కది సహజసుగుణసంపదకాదే! 79

ధీవిదితాభిప్రాయము
సూవే మతమగును; దానిస్థూలీకరణం
బే విగ్రహా; మద్దానికి
గ్రావాలను మొకఁడు గట్టుఁగా మతగురుఁడై. 80

కవిధీయుగభిప్రాయం
బవ్వ మతము; తదీయసముచితాకారంబే
కవితావృత్తము; కావ్యం
బవును తదాలయము భాసురాలంకృతియై. 81

తమతమ యాలయములలో
సుమనఃపూజలను సలుపఁజూతు రిరువురున్
స్వమతానురోధముగ, మో
క్షము భగవద్దర్శనమ్ము, గాంక్షించి మదిన్. 82

కవివరుఁడును మతగురుగతి
నవలంబించుచు స్వకీయమగుమత, మటులే
భువి నితరులు దన్మతమునఁ
దవులం గాంక్షించు నుభయతారకదృష్టిన్. 83

కవియు మతాచార్యునివలె
నవినాభావైకమైత్రి నందు మతముతోఁ;
గవి మతముఁగూర్చి యాడుట
దివిజేంద్రుఁడు పవినిగూర్చి తెలుపుటకాదే! 84

"కవి బ్రహ్మజ్ఞాని, గురుం
డవు నజ్ఞానాపహారి" యని బుధు లనరే?

కవిగురు లిరువురయంమనఁ
గవియే యధికుండు గురునికంటెన్ వింటే ? 85

కవి యక్షరసృష్టిని, వా
గ్ధవుఁడో క్షరసృష్టిఁ జేయఁగలుగున్ జగతిన్;
గవివాగ్ధవు లిరువురలోఁ
గవియే వాగ్ధవునికన్న ఘనుఁ డనవలదే ; 86

కావ్యవిరచనమును ఋషి కానివాఁడు
సలుపలేఁ డన్నసూక్తి చర్చాపదంబు,
కావ్యవిరచనమున ఋషి కాఁడె యొకఁడు ?
కవికి ఋషికిని భేదంబు గలదె యెందు ? 87

నాన్యసామాన్యవిజ్ఞానతేజోరమా
పరిణతానందానుభవమునందు
చర్మచక్షుర్ద్వారిజన్యాగోచరపరా
శక్తిసందర్శనాసక్తియందు
లోకసంస్కరణార్థలోలచిత్తాయత్త
నిగ్రహానుగ్రహనియతియందు
శార్దూలమత్తేభసంచారకవనస్థ
యతిగణసాహచర్యంబునందు

విశ్వకావ్యావలోకనవిషయమందు
విబుధమార్గానుసరణైకవృత్తియందు
దైవసాక్షాత్కృతిప్రాజ్యధర్మమందు
గవియు ఋషియును దుల్యులుగారె భువిని ? 88

నవరసతరంగడోలల
నవనవగతి నాడి పాడి నలువారెడుత
త్కవిసంగతి మనుహంసలు
నపురా ! తెలతెల్లవోవు టరయుట లేదే ? 89

కనఁగఁ గవీశ్వరుండు ఋషి
కైవడి సర్వముఁ దా నెఱుంగఁడే !
యనితరసాధ్యము ల్గవుల
హస్తగతమ్ములుగావె ? తన్మతం
బనుకొనానేల ! మేటికళ
లన్నియు సత్కవి నాశ్రయించుఁ జు
మ్మని వరియించు తత్కళల
తోయమునం దగి కృష్ణభూవరా ! 90

కవిమహత్త్వంబు నే నింతకన్న నధిక
మనుట కావశ్యకత యెంతయైనఁ గలదు ;

కవినిఁ జులుకనసేసి తా ఘనత నొసఁగ
నొచునాచార్యతత్త్వ మే రెవ్వఁగలరు ? 91

కొండ నరసి మెండి గండుల డీకొన
మెండినెత్తి వగులకుండ నున్నె ?
కొండమెండితంట మెండిగండమెలీర్చుఁ
గొండ కొండుఁజేటు గూడ కుండు. 92

తానా, రాజపురోహితుఁ;
డేనా, యాస్థానకవిని, నీయవసరమం
దానుటకుఁ గా దనుటకు
భూనాథా ! కాదె మీకు మోమోట మిటన్ ? 93

ఏమతము ప్రచారార్హమొ
యేమతము ప్రచారమాటయే యనుచితమో
తా మెఱిఁగి యనరు సభ్యులు
భూమీశా ! మీరు విన్నబోయెద రచుచున్. 94

ఇతరసీమలపండితు లేగుదెంచి
తీర్పుఁజెప్పుట కిట వెనుదీయుచుందు
రిరువురమతమ్ము లేకమై యెసఁగుకతన
నతనిఁ గా దన మిమ్ముఁ గా దనుట గాదె ? 95

మానవుల కిచ్చకమ్ము సన్మానహేతు
వగుట నెంతటివాఁడైన నది యొనర్చు;
నిచ్చకమ్మును రాజులు మెచ్చుచుంట
నిట్టిసభ నిచ్చకమ్మున కేటిలోటు ? 96

నరు లెవ్వారలు నీవివాదవిషయా
నం దీర్పుఁజెప్పంగ నో
ల్లరు మీమోమును జూచి యిచ్చకమువ
ల్లంగాని, నావాద మే
పొరపాటుం గయికొంటఁ గాదు ; వినుమా
భూనాథ ! న్యాయంబు నేఁ
డరయన్ జంతువుల న్వరించినటు లూ
హంజేయ నా నిర్మ్యోడన్. 97

పరిశీలించెద న్యాయనిర్వహణ స
త్త్వశ్రేణులం, దాపయిన్
గరిమం గోరెద నీవివాదముఁ బరి
ష్కారంబుఁగావింప, నిం
డిరుమాసమ్ములకాలమైన గడు వం
చెం తేనిఁ దాఁ గోరి భూ

వరునిన్, రెండియు రామలింగకవి దు
ర్వారక్రియఁ వాకొనెన్. 98

"ఈసభ్యులఁగాని మఱి
యేసభ్యవ్యక్తిఁగాని యే నడుగక నాఁ
డీసభలో జంతువుచే
నీ సందర్భమునఁ దీర్పు నిప్పింతు నృపా ! 99

అనఁ దాతాచార్యుం డది
విని రయమునఁ గృష్ణరాయ పృథ్వీశునితో
ననె : "నీకొంటిని, నటుచే
యనిచోఁ బరిహార మేదో యనవలెఁ గాదే?" 100

పరిహారమ్మును గోరిన
గురుఁడు వినఁగ సభ నెసంగు కోవిదు లుదరన్
ధరణీకాంతునితో నీ
కరణిఁ బలికె రామలింగకవి తమకమునన్. 101

"ఇంతకుఁ దప్పెడుచో నేఁ
బంతమ్మున నాంధ్రకవిత వదలెద, మఱి యా
జంతువె తీర్పెడుచో మీ
వంతున నాకోర్కెఁ దీర్పవలవదె మీరున్. 102

నాక విజయంబు గలుగ నానాఁటినుండి
వైష్ణవమత ప్రచారమ్ము వదలి, ప్రజల
క్షేమతము సమ్మతమొ వార లామతంబుఁ
బూన విడువంగవలయు నాపైన మీరు" 103

సరసుఁడు గడుసరి నేర్పరి
యురుదీర్ఘాలోచనాప్రయుక్తుం డగు భూ
వరుఁ డాత్మదేశికునిఁ గని
"సరియే, కానిం" డటంచు సమ్మతిఁ బలికెన్. 104

జంతువు తీర్పుఁజెప్పుట య
సంభవ, మీతని కింతతోఁ గవి
త్వాంతము నిశ్చయంబు, కవి
తాదృతి వీడెడు వీని నింక భూ
కాంతుఁడు సేరఁదీయఁ, డురు
కంటకమై చను వీని పీడ నా
కింతట వీడునంచు గురుఁ
డీకొనె వాని ప్రతిజ్ఞ కిచ్చమై. 105

అంతట కృష్ణభూపతి స
భాంతము సూచన సేయఁ దత్సభా

భ్యాంతరసభ్యకోటి విన
యమ్మున లేచి నమస్కరించి సు
స్వాంతులు గాఁగ గాయనులు
భక్తిని రక్తిని నాంధ్రమాతృ వృ
త్తాంతముఁ బాడ రీగతి సు
ధామధురస్వర ముప్పతిల్లఁగన్. 106

ఆంధ్రజన జనయిత్రి !
జోహార్ ! జోహార్ !
అమృత వాగ్వైచిత్రి ! జోహార్ !
భరత భూభామినీ
పరమపావనగర్భ
శుక్తముక్తామణీ ! జోహార్ ! జోహార్ !
శక్తిసంధాయినీ ! జోహార్ ! 107

శ్రీదగోదావరీ కృష్ణాధునీ
స్వాదూదకార్ద్ర సస్యశ్యామలా !
వంశధారా తుంగభద్రాది వాహినీ
శీకరాభినిషిక్త శీతానిలా !
ఆంధ్రజన జనయిత్రి...... 108

ప్రకృతిసౌందర్య శోభాభాసితా !
ప్రణుత మానవకౌశల ప్రాంచితా !
శ్రీశైల భద్రాద్రి సింహాచల మహేంద్ర
శేషగిర్యాది సుక్షేత్రాన్వితా !
ఆంధ్రజన జనయిత్రి...... 109

గురుశుక్ర సమమంత్రి పరిపోషణా !
సరసగాయక కవిశ్వరభూషణా !
రణధీర రమణానుగుణ సాహసక్రియా
రమణీయ రమణీసరణి రక్షణా !
ఆంధ్రజన జనయిత్రి...... 110

ఆమధురవింధ్య విఖ్యాతావనీ
సీమోరు రాజ్యలక్ష్మీశోభినీ !
ప్రాక్పశ్చిమాశా ప్రపంచ వాణిజ్య సం
ప్రాప్తాధికైశ్వర్య ఫలభాగినీ !
ఆంధ్రజన జనయిత్రి...... 111

తతపంచశతవర్ష మితపాలనా !
సుతకోటి త్రితయసన్నుత లాలనా !
"శిముఖ, యజ్ఞశ్రీ, ప్రసిద్ధ పులుమాయి, దు

ర్మము శాతకర్ణి" ముఖరాజావనా !
ఆంధ్రజన జనయిత్రి...... 112

హే ! మాత ! హే ! యశోభాగ్యేందిరా !
హే ! మన్మనోవారిజేందిందిరా !
భవదీయదివ్యసేవాతత్పరాత్మీయ
భవకోటిహేతుశక్తివిభాసురా !
ఆంధ్రజన జనయిత్రి...... 113

ఆసంసద్భవనంబు వీడి చని రా
యావ్యక్తు లావెన్క స్వా
వాసశ్రేణుల, కంబరంబు నడికిన్
భానుండు వో నాతప
త్రాసావేశము నొంది నీడలు నిజో
త్పత్తిప్రదేశాశ్రయం
బాసం జేసెను, సూర్యకాంతసుమ మా
స్యం బెత్తి చూచెన్ రవిన్. 114

ఖపథసంచారకద్విజకులము నరసి
పట్టి పల్లార్చనెంచి సత్పథమునందుఁ
దాపమునకోర్చి, తటివేచి, దశదిశాళి
ధీరతరవృత్తి విహరించె దూరదర్శి. 115

# ప్రజాశాంతి

ఆనాఁ డాదిగ రెండుమాసములయం
దావాడ నీవాడ ను
ద్యానశ్రేణులఁ బాఠశాలల సభా
స్థానంబులం దూరిలో
నానాసీమల మూఁగి భిన్నవచన
న్యాసప్రకారంబులన్
బూనం జొచ్చిరి తత్పురప్రజలు శం
భూపాసకుల్ వైష్ణవుల్. 116

"తిరుమణినామ మూనెదవొ,
దేశము వీడెదొ, కానిచో బహి
ష్కరణమహాతపంబునడిఁ
గ్రాఁగెదవో" యని మమ్ము నేఁచి, మా
గురుల నపాయకూపమునఁ
గూలిచి తూలెడు వీరవైష్ణవో
త్కర మొనరించు బాధ లివి
తప్పునె యెన్నటి కైన నీశ్వరా! 117

రుద్రాక్ష భద్రాక్ష రుచిరమాలలు ద్రెంచి
తులసిపూసలపేర్లు గొలిపి మెడల

హరదేవసంప్రీతికరపత్రపుష్పాళి
నిహనిలారుహములఁ బుడమిఁ గూల్చి
శైవమతగ్రంథసందోహముం దెచ్చి
కీలికీలాహుతిం గేలిసేసి
వీరశైవులనోట విష్ణునామమ్ములు
ముమ్మాఱు వలికించి మురిసి, చఱచి
చెవులఁగల బిల్వపత్రాల నవలఁ ద్రోచి
కృష్ణతులసీదళంబులు గీలుకొలిపి
శైవభక్తుల నష్టకష్టాలు పెట్టు
వీరవైష్ణవులను దిద్దువారు లేరె? 118

లీల శివాలయానఁ గల
లింగము వైష్ణవదైవతాకృతిం
దాలుచునట్లు మల్చి, శివ
దైవతభక్తుల మమ్ముఁ ద్రోలి, మా
యాలయ మాక్రమించుక శి
వార్చన మాపుట కెట్టు లోపుటో?
తాలిమి కెల్ల లేదె? యిఁక
దారుణవైష్ణవమున్ సహింతుమే? 119

మతదోషం బననేల ? మానవులను
ర్మార్గస్థితుల్ గాక, యీ
క్షితిపై సర్వమతమ్ము లుత్తములే ;
జీవింతు రేతన్మతా
స్వాతులం దుత్తమమధ్యమాధములు ; చ
న్నే వ్యక్తిసంజాతదు
ష్కృతము ల్గాంచి తదీయజాతిమతమే
కీ డంట యేదంటకున్ ? 120

గురువులు లేరే మా కి
ట్లురుకమని పిడుగుఁటు వార లున్నారే ? యీ
నరపతి వైష్ణవుఁ డౌటను
గురునకు నడినెత్తిమీఁదఁ గొమ్ములు మొలిచెన్. 121

నిజముగఁ దప్పుకపోయిన
బుజములు తప్పుకొననోపు, మూపుల కగునే
గజిబిజి ? తాతాచార్యుఁడు
విజయావేశమున ముద్రవేసెడువేళన్. 122

తిర మఱి జంతువుల్ పశుప
తి న్విమనస్కములై భజింప, సు

స్థిరమతి నే మహాత్మా! పశుప
  తి స్సృజియించుట పాపమయ్యెనో ?
చురకలు రోగదుర్దశలఁ
  జొప్పడఁగా నల జంతుజాలికిన్,
జురకలు మా కరోగదశఁ
  జొప్పడె ముద్రలమూలకంబుగన్. 123

సిలుగులువడి యిం దుంచుట
వలనఁ బ్రయోజనము సనునె? వైష్ణవబాధల్
దొలఁగం జని పెఱయూరను
బలుసాకుం దినుచునైన బ్రదుకుట మేలౌ. 124

మాత్రాది స్మృతిజెన వీరవైష్ణవమహో
  న్మాదానలోద్దీప్త ని
ర్నిద్రామిత్ర మతోగ్రజీవితము ని
  శ్ఛేదించి యన్యోర్వికిన్
భద్రాశం జన నందు శైవులు నవి
  శ్వాసంబునం జూడరే ?
ముద్రాదగ్ధ భుజద్వయాన్వితుల మ
  మ్మున్ భ్రష్టశైవావళిన్. 125

బండగుంగ్రాతి కిద్ధరూపంబు నిచ్చి
రాగ భోగామలంగూర్చి రక్తియుక్తి
భక్తిభావము వెదచల్లు వైష్ణవంబు
ముక్తి నిడఁజాల దనువాఁడు మూర్ఖుఁ డొకఁడె. 126

వదనములందు శైవులను
వైష్ణవులున్ స్వవిశేషకర్మ్ములన్
గుదురఁగఁ దాల్చువైఖరి య
కుంఠితరీతినిఁ జాటు నేమతం
బెదుగుచు నున్నదో పతన
మేమత మొందుచు నున్నదో కొ—; యీ
సదమల చిహ్నముల్ మనకుఁ
జాలవొ ? వాదము గీద మేలొకో ? 127

మాది సజీవమత మ్మగు
మీదో జీవన్మృతంబు; మీకనుకూలం
బేదియొ ద్వైమతంబులఁ గన
రాదే శ్రీరాజమతము గ్రాహ్యముగాదే ! 128

రంగారు రాజమత మని
పొంగుచు స్వమతంబు వీడఁబోవుట తగునే ?

బంగారుకత్తి యని గళ
ముం గోసికొనంగఁ జూచుమూర్ఖుఁడు గలఁడే ? 129

మతమును జీర్ణవస్త్రమటు
మాఱుప నోపునె మానవుండు, సం
తత మది మానవాస్రశత
ధారలలో నొక దివ్యధారయై
మతికి సులోచనం బయి స
మాగత జీవిత దిక్ప్రదర్శనా
ద్భుతగురుయంత్ర మాట, మృతిఁ
బొందునుగాని మతంబు మార్చునే ! 130

పరమసుఖజీవనక్షీరవార్ధిలోన
విమతహాలాహలం బుద్భవించె, నింక
సర్వసుమనస్సమూహ రక్షాకరుండు
రాజశేఖరుఁ డొక్కఁడే రక్ష మాకు. 131

ధూళిని మేనఁ బూని పులి
తోలును దాల్చి బిచ్చమెత్తు నా
శూలియె మేటిదైవతమొ,
సుందరచందన మూని మేనిపై

మేలిదుకూల మొందుసిరి
మేటి యనుత్తమదైవతంబొ, యే
బోలునకైనఁ దోఁచుఁ గడె;
ప్రాజ్ఞుల కియ్యది తోఁపకుండునే? 132

తతభిక్షాటన మూని తాను మని, భ
క్తశ్రేణి కైశ్వర్య సం
తతి నిత్యం బొనగూర్చుచుండు శివుఁడో
తద్భోగభాగ్యాబ్ధి నా
తత మోలాడుచు భక్తకోటికిఁ బ్రభూ
తశ్రీలు చేకూర్చు న
చ్యుతుఁడో - యిర్వురలో ఘనుం డెవఁడొ మీ
రూహించుకో రాదొకో? 133

వరదాత న్మను మొత్తి చూడ వరస
త్త్వంబున్ వృకుండాదిశం
కరు వెన్నాడుటఁ జూచి జాలిగొని పేఁ
కణ్ శౌరి తా నేగి ము
ష్కరదైత్యుం గికురించి శూలి నెటులో
చాకుండ రక్షింపఁడే?

హా! యూవేళ నుపేక్ష సేయు హరుఁ డే
మై యుండునో యెంచితే? 134

అనుదిన మాహారుం గొలువ
నంబుజహంబులు వేయిఁ దెచ్చి య
ర్చన మొనరించు చొక్కు జల
జాతము సాలమి నొక్కనాఁ డహో!
తననయనాంబుజంబు నిడ
తన్మధుసూదను మెచ్చి యీాయఁ డే
సునిశితనేత్రచక్రములు
శూలి దయాకలితాంతరంగుఁడై. 135

శివుఁ డా కేశవభక్తుం
డవును, సదాశివునిభక్తుఁ డవుఁ గేశవుఁ; డా
శివకేశవమతములు రెం
డవునే? యవు ననెడివార లజ్ఞులు కారే! 136

యమునాపరిష్వంగ మందెదు నాతండు
యమునాపరిష్వంగ మందు నితఁడు
నురగోరుసాంగత్య మొందెదు నాతండు
నురగోరుసాంగత్య మొందు నితఁడు

గోపరిపాలనాకుశలుఁ డా నాతండు
గోపరిపాలనాకుశలుఁ డితఁడు
నక్షీణరత్నాకరాప్తుఁ డా నాతండు
నక్షీణరత్నాకరాప్తుఁ డితఁడు
భూతిధారణ మొనరించు పురుషుఁ డతఁడు
భూతిధారణమొనరించు పురుషుఁ డితఁడు
గిరిధరుం డాతఁ, డితఁడు గిరిధరుండు,
హరిహరులయందు భేద మావంత గలదె? 137

శివుఁడే విష్ణువు, విష్ణువే శివుఁడు కిం
చిద్భేదమున్ లే దనన్
శివశూలాంకము వైష్ణవుల్, హరిసతీ
శ్రీభూమినీలాఖ్యలన్
ముప్పురన్ దెల్పెడుభూతిరేఖలను శం
భూపాసకుల్ మోములం
దవులం బోవుట చాటదే ద్వైమత సి
ద్ధాంతైకతత్త్వస్థితిన్. 138

ఈమతవాదమందుఁ గవి
కింతటిబాస యొనర్పఁ జెల్లునే?

తామసవృత్తిఁగాక, పశు
తత్త్వమె యుంగఁడె?, కైత మానుకో
నేమని నిశ్చయించెఁ దన
కిందున నోటమిగల్గుచోఁ, గటా!
యేమనుకొన్న నేమి ఫల,
మొండిన యేటికి నేతు వేటికిన్. 139

ఎంతటియుక్తిశక్తి లభి
యించెనొ యంతటియుక్తిశక్తియా
నెంతయు నీక్షపీశ్వరున ;
కెంత వచించునొ యంతసేయు ; ట
గ్దంతిసమానపండితవి
తానమునైన నెదిర్చి గెల్చి న
త్యంతము రామలింగకవి
యన్న ననంతుఁ డజేయుఁ డెంతయున్. 140

ఓటమి యంట లేదు కవి
కుర్విని నింతటిదాఁకఁ గాని, యీ
నాఁటన తథ్య మోటమి, య
నంతర మందపుఁదెల్గుఁగైతకే

కాటకి మాట జే.డు మది
గానక యిర్వురకున్ మత్తాన‌ం బో
రాటము సాగనిచ్చు నిది
రాచటీకం బని చెప్ప నొప్పునే ? 141

సరసాలాపమొ, సత్యభాషణమొ, హా
స్యప్రోక్తియో యేమొ—యీ
పరమాశ్చర్యకరప్రతిజ్ఞ నెఱపే
ర్పంజెల్లునో చెల్లదో
యరయం జాలను కాని, సత్కవి కసా
ధ్యం బొందు లే దన్న బం
ధురవిశ్వాసముమాత్ర మాత్మహృదయం
దుం గల్గు నీనాఁటికిన్. 142

పాపాత్ముల్ ప్రతిపక్షు లందఱకు వి
శ్వాసంబుఁ గల్పింప గీ
తాపారమ్మును జంతువ్రానునొకవిం
తం జేయ జ్ఞానేశ్వరుం
డోపన్నేడె ? యసాధ్యమే సుకవి కీ
యుద్యోగ ? మేపుట్టలో

సేవా మున్నదో యే రెఱుంగ నగునే ?
యీనాఁటి కేనాఁటికిన్ ? 143

ఇసుమంతైన నను జ్ఞానపుఁ
బస యసలే లేనినరునిఁ బశు వనుచుంటున్
బసచెడిన నరునిఁ బశు వని
త్రోసకుం దీర్పరిగఁ దీసికొని వచ్చెనోకో ? 144

"పశు వేష తీర్పుఁ జెప్పంగల్గు టది యేష ?
నెవ్వారైన నను విన్న నవ్వ పోరె ?"
"విజయి యూనెసఁ ధాను బ్రజ నేషిపింపఁడే
రాజపురోహితుం డోజ నింక"
"అన్యమతమ్ము లీయాంధ్రోర్విలో నింక
వర్ధిల్లునంట స్వాప్నద్వ్యవస్థ"
"సుతిమించుచో నేఁటి మతకలహం బాంధ్ర
చరితాసితాశ్వాస మరయఁ గాదో ?"
యనుచుఁ భారులు దమకుఁ దోఁచినవిధాన
మోహాకోపతాపమ్ములు ముప్పిరిగొన
నూహసేయుచు వాకొనుచుండఁ బురము
మథితదుగ్ధపయోనిధిమాద్రిఁ దోఁచె. 145

దాక్షౌయ్యంబు లీలాచరద్ద్విజతతిన్
దండించి ఖండింప దు
ర్వ్యక్షౌవృత్తి నహాస్సులందునఁ, దమో
వేళన్ దివాంధోత్కరం
బక్షిగాళల ఖేచరావళిని సం
హారంబుసేయన్ జతు
ష్పథంబుల్ చనెఁ గాలచక్రమున దు
ర్వారప్రచారంబునన్. 146



# ప్ర బో ధ ము

అంతటఁ గొల్వుదీర్చెను ధ
రాధిపుఁ డర్మిలి ; నాఁడు దత్సభా
భ్యంతరమందు గాయకులుఁ
వందులు, మంత్రులు సత్కవుల్, గళా
వంతులు, జ్యోతిరాగమవి
పశ్చితు లాఢ్యులు రాయబారులున్
బంతులుదీర్ప నింద్రసభ
వైఖరిఁ దత్సభ దోఁచె సత్తతిన్. 147

ఆనాఁ డద్భుత మేదియో యొదవు నం
చాయామతాస్వోతు లా
స్థానం బందునఁ జేరి క్రిక్కిఱిసి యి
చ్ఛారీతి భాషించి తా
రానందంబు విషాద మచ్చెరువు నో
య్యం జూపుచుండన్ సభా
స్థానంబెల్ల మహోదధింబలె నినా
దస్ఫూర్తి నేపారెడిన్. 148

అంత వినంబడెన్ జయ జ
యధ్వని మేటినగార వాగె ; దు

గ్రాంతికసీమ నెత్తిన మ
హోయసన శస్త్రవరంబు మ్రోగె ద
గ్దంతులు దద్దరిల్ల, శుభ
ఢంబగు శంఖరవంబు చెఁగె, నా
శాంతము సాగె వేదనిన
ధార్భటి, వందుల సంస్తుతుల్ దగెన్. 149

ఆముక్తమాల్యదాఖ్యాకప్రబంధంబు
రచియించి మించె నేరాజవరుఁడు,
పురమేఁగు-చోఁ గవీశ్వరుఁ బల్లకిం బెట్టి
తనకేల నెత్తె నేధరణిజాని
గురుశుక్రసమమంత్రివరపరిరక్షిత
రాజ్యాభిషిక్తుఁ డేరాజమౌళి
కసిచేత నసిచేతఁ గలిమిచేఁ జెలిమిచే
నిజరాజ్య మేలె నేనేలతేఁడు
ఆమహారాజు కృష్ణరాయాహ్వయుండు
అరిఘటానీక సమదపంచాననుండు
మూరురాయర గండాంకధారి చేరె
నాసభోర్విని రాజమర్యాద మీఱ. 150

ఘనతరులుఁ బడ్మినుల్ గవ్రుల్ గణికలు ద్విజ
సమితి భూభృత్సమూహము సరసు లెదుట
రాగరమ్యస్థితిం దన రాక నెసఁగ
గిరిసమున్నతపీఠిని వఱలె నినుఁడు. 151

వీణవాయించె విద్వత్ప్రవేకుఁ డొకఁడు
పాటపాడెను గాయకప్రవరుఁ డొకఁడు
వరవిలాసిని యొక్కతె భరతనాట్య
సత్ప్రదర్శనమును సల్పె సభ్యు లలర. 152

తిరుమణిఁ దిరుచూర్ణంబును
దిరుఫాలంబులను దిద్ది తిరుపతిభక్తో
త్కరమటు లంతేవాసులు
తిరుదేశికురాక సభను దెలుపుచు దరియన్. 153

గళసీమఁ దులసిపూసల మాలికలు దాల్చి
జపమాల వలకేల సంతరించి
హరిపాదముద్రాసహస్రముద్రితవిచి
త్రాంశుకం బుత్తరీయముగఁ దాల్చి
యురమున నిజభుజోదరలలాటంబుల
నూర్ధ్వత్రిపుండ్రంబు లొప్పఁ బెట్టి

బంగారుగొడుగులపావకోళ్ళు ధరించి
 పసుపుఁబచ్చనిపట్టుఁబట్టఁ గట్టి
చిన్నితులసీదళంబునుఁ జెవినిఁ గొలిపి
యెడమచేతను "తిరువాయిముడి" గ్రహించి,
కొసరి గోవిందనామముల్ గొణఁగుకొనుచు
వచ్చె నాచార్యుఁ డాసభాభవనమునకు. 154

రాకాశశిరాకకు నీ
రాకరమటు సత్కవీశురాకకు సభ న
ట్టాకంగలశైవులు మధు
రాకాంక్షం బడుచునుండి, రాకాలమునన్. 155

కవియై, హాస్యవచస్వియై, విబుధవా
 క్సంగ్రామరంగోజ్జ్వల
ద్భవుఁడై, కాకవిఘూకభీకరమహో
 దగ్రాతపప్రస్ఫుర
ద్రవియై, దుష్టవిమర్శకాగపవియై
 రమ్యప్రబోధప్రథా
ధవుఁడై మించినరామలింగకవి యం
 త న్వచ్చె నుత్సాహియై. 156

బంగారుజలతారుపనిఁ గ్రాలుసాలువక
వలెవాటుగా వైచివచ్చు టరసి
భస్మరేఖలు మూఁడు ఫాలభాగంబున
తీర్చిదిద్దిన మతోద్రేక మరసి
పెదవులఁ దోబూచివెట్టి మిట్టాడెడు
మందహాసములోని మర్మ మరసి
తపనీయపంజరాంతరకీర మత్తటి
"విజయోఽస్తు" నాఁ బల్కు-వింత నరసి
యదురుబెదరును లేనిపన్యాస మరసి
మోమునన్ సంశయచ్ఛాయలేమి నరసి
కవికి విజయము ధ్రువ మని కలఁత నెడసి
శాంతి నొందిరి సభనున్న శైవు లెల్ల. 157

తన కెడవంకఁబ్రిధాను, లావరుసన
సామంతరాజసంచయ మెసంగఁ
గుడిప్రక్క గురుఁ డుండ గురుసమ్ముఖమునందుఁ
గవు లష్టదిగ్గజాఖ్యాతు లమర
నధిపాభిముఖులౌచు నాసీనులై సభా
ప్రాంగణమ్మున సదస్యాళి పొసఁగ

చరమభాగంబునఁ జామరంబులు వీచు
పరువంపుగరితలు పరిఢవిల్లఁ
గుంచనపుగద్దె రత్నాలనొడుగుక్రింద
రాజసింహాసనము శ్రీకృష్ణరాయ లలర;
భువికి దిగివచ్చె వైకుంఠపుర మనంగ
భువనవిజయాఖ్యనృపసభాభవన మొప్పె. 185

వేదత్రయవిద్యాసం
పాదకులై వృద్ధులైన బ్రాహ్మణు లాశీ
ర్వాదముసేయఁగ సుందరు
లాదరమున నాంధ్రమాత నభినందింపన్. 159

ప్రారంభించినరాజకృత్యములు ని
ర్వర్తించి, యావెన్క వి
ద్యారక్తుండగు కృష్ణభూవరుఁడు వి
ద్వద్గోష్ఠిఁ గావింపఁగా
గారామారఁగ సభ్యకోటికి నమ
స్కారంబు గావించి యీ
తీ రొప్ప న్నుడివె న్వివాదవిషయా
ధీనప్రసంగంబునన్. 160

గురువనఁ దత్కవీశ్వరున
    కున్మతవాదము సాగియుంట మీా
కెఱిఁగినదే కదా ; గడువు
    నింతటఁ గల్గెను, నేఁడు సత్కవీ
శ్వరు శపథప్రకార మొక
    జంతువు తీరుపు నీయనున్న, దీ
శ్వరకృప నింతతోఁ దగవు
    సర్వము సాల్వడు నంచు నెంచెదన్. 161

కౌండిన్య సద్గోత్ర కలశపారావార
    పార్వణచంద్ర ! సత్పండితేంద్ర !
ప్రాజ్యాంధ్రకవనసామ్రాజ్య సింహాసనా
    ధిష్ఠాన సంశక్త ! ధీప్రసక్త !
సత్కవిసహకార సంసద్వసంతోత్స
    వాలాపనవసుధాలాలసాత్మ !
యాంధ్రోక్తి సంస్కృతం, బల సంస్కృతం బాంధ్ర
    మని సమర్థించు విద్యాప్రవీణ !
వ్యర్థపదశూన్య సత్కవిత్వైక తేజ !
సకలకింకవి మూషిక సర్పరాజ !

హాస్యరసవర్తి ! సితకీర్తి ! యమృతమూర్తి !
రామలింగ కవీంద్ర ! సారస్యసాంద్ర ! 162

వసమై జంతువు దీర్పు నిచ్చు నని సం
భాషించి తీ వోకవి
పరిసవంబా ! శపథమ్ము నేడు నెఱవే
ర్పం జెల్లు; నీయద్భుతం
బు సభాసీమను జూడనుండిరి జన
మ్ముల్ వేసవే లింక నీ
యసమానప్రతిభావిశిష్టకృతివి
ద్యం జూపు విహారిత్తమా ! 163

అని చేతులు జోడించుక
యినుఁడు కవీశ్వరున కెఱగి యెలమి నెసఁగుటన్
గని తాతాచార్యుండునుఁ
దనసమ్మతి సూచకముగఁ దలయూచెఁ దగన్. 164

ఇనునుడి విని, గురువరు మో
మును గని, యొకమందహాసమును బుచ్చుచు మైఁ
గొనుసాలువ సరిదిద్దుక
తనగొంతును సరుదుకొనుచుఁ దమకమువిూఱన్. 165

కరతాళధ్వను లాసభాస్థలము సం
గావింపగా సభ్యులం
దఱు నొక్కమ్మడి, రామలింగకవి మో
దం బంది కేల్మోడ్చి, కే
సరిలీలన్ సభలోన నిల్చుచుఁ బ్రశం
సానైపుణిం బల్కె, నీ
శ్వరతేజోలసితాననుం డగుచు భా
షాదేవతోపాసియై. 166

"అళినీగళమ్మున నాలతిఁ బచరించి
కోయిలకుత్తుకం గులుకు గాణ!
పసిపాపనోట నువ్వులుఁ దేనెలు చిల్కి
ముద్దుముచ్చట లీను ముద్దులాడి!
కవిరసనాగ్రరంగము నెక్కి నవరస
స్ఫూర్తిమై నాడెడు సుందరాంగి!
యామ్నాయమూలరహస్యార్థతత్త్వంబు
మునివాక్యమునఁ జాటుముక్తికాంత!
యచరసృష్టిముఖాన సవ్యయుని లీల
ముగ్ధవాగ్ధోరణిం జెల్లుమోహనాఁగి!

శబ్దవిద్బ్రహ్మ్మకున్‌సతి ! శారదాంబ !
నిలిచి నాలోన నావాయిఁ బలుకుమమ్మ ! 167

రాజా ! రాజగురుండ ! సభ్యవరులా
రా ! సావధానంబుగా
నాజల్పంబుల నించుకంత వినుఁడీ
నామీఁదమీఁకున్నయ
వ్యాజప్రేమఁ బురస్కరించుక ; యుప
న్యాసాంతమం దిందు వి
భ్రాజత్ప్రీతినిఁ దీర్పునిచ్చు నొకస
త్త్వం బంచు నాశించెదన్. 168

పరవైష్ణవకృతదుష్టవిధులు గాంచి
యపుడు వైష్ణవవైరిగా నభినయించి
కడఁగి వారల కొకనీతిఁ గఱప నెంచి
మించి వాదించి ప్రతిన గావించియుంటి. 169

ఇంతియేకాని యేమత మైన నేమి !
మమత హేతువు మతవివాదముల కెల్ల ;
మతము లన్నింటఁ గలపరమాత్మతత్త్వ
మెఱిఁగి వర్తించువారల కితర మేల ? 170

శైవుఁడను నేను, వైష్ణవస్వామి నేను;
లేదు శివకేశవుల కింతభేద మెందు
ననుచు శివకేశవులకథ లాడియుంటి
ద్విమతములయందు సామరస్యము గ్రహించి. 171

శివభక్తులైన దంపతు
లవని న్ననుఁ గన్నవార లగుటను మఱి యీ
శివకథలను నే నోడువుట
నవురా! న న్నరసి శైవుఁ డనియెద రెందున్. 172

పాండురంగమాహాత్మ్యకావ్యంబు నేను
సలిపి ప్రచురించువెనుక వైష్ణవుఁడు వీఁడ
యనుచు మున్ముందు నన్గూర్చి యాడనోపుఁ
గవులచరితము విరచించు గ్రంథకర్త. 173

సేవితుఁ డగుభూపాలుఁడు
శ్రీవైష్ణవుఁ డగుట నితఁడు శ్రీవైష్ణవుఁడై
శైవమును వీడె నను నవ
భావుల్ జనియించి భావిఁ బలికెదరేమో! 174

ఇదికాక యొక్కచిత్రం
బదిరా! కానోపు 'నీతఁ డాదిని శైవుం,

వెదిగినప్డె వైష్ణవుఁడై
పొదలె ననుట కూడఁ బుడమిఁ బుట్టెడునేమో ! 175

ఏమతము నాదియన్న నా కేటిపోటు,
ఏమతం బేదనున్న నా కేటియోటు,
సర్వమతసూనమధురసాస్వాదనైక
మత్తమధుకరసమచిత్తవృత్తి నగుట. 176

జననమునొందునప్పుడు ప్ర
 శాంతనిరంకితసన్మనస్కుఁడై
జనుఁడు క్రమక్రమం బెదిగి
 సాంఘికవాసన లంటుచుండఁ ద
జ్జనగణసమ్మతం బయినత
 న్మతమే తనదంచునెంచు, ని
ట్లనుకరణమ్ముగాక మత
 మన్నది పుట్టుకతోడఁ బుట్టెనే ? 177

ఎవరో కొందఱు వ్యక్తు లేదనో స్వతం
 త్రేచ్ఛారతిం జెంది ప
ర్యవలోకించి మతార్థతత్త్వమును స
 మ్యగ్రీతి, నేతత్క్రియా

భవనిశ్చంచలయుక్తియుక్తసదభి
ప్రాయంబుఁ బాలింతు, రీ
భువిఁ దద్భిన్నజను ల్గతానుగతికుల్
బో తన్మతస్వీకృతిన్. 178

మత మభిప్రాయ మగుట నిమ్మహిని భిన్న
భిన్నమతము లభిప్రాయభేదకార
ణముగ జనియించెఁ గాలక్రమమున రహిని;
మతముతోఁ బుట్టు వయ్యెను మమత మహిని. 179

ఆది నెసంగె నొక్కమత,
మావల నాత్రిమతంబు లొప్పె, నా
పైఁ దగె షణ్మతంబు; లొగిఁ
బాదపశాఖలఁబోలెఁ బుట్టుచున్
మేదినిపై మతాలు మెల
మెల్లన వృద్ధినెసంగె, మాయురే!
యీదినమందు భూమిజను
లెందఱొ యన్నిమతంబు లొప్పెడిన్. 180

ఇన్నిమతంబు లుంట నరుఁ
డింగిత మేదుచు నజ్ఞతాంధుఁడై

యన్నియు నేకతత్త్వ మగు
టారయలేక, స్వకీయమైనదే
యెన్నగ నుత్తమంబు మఱి
యింకొకఁ డౌనది యీశ్వరాహితం
బన్న ప్రమాదభావమున
నన్యమతస్థుల హింసఁ జేసెడున్. 181

తనమతమే మహోత్తమమ
తం బని యన్యమతావలంబులన్
దనమత మూనఁజేయ జత
నం బొనరించి_తెగించి యందునే
మనుజుఁ డెదిర్చునో యతని
మట్టుచుఁ గొట్టుచుఁ దిట్టికట్టి యిం
ధనములఁ బెట్టి కాల్ప శత
ధా మనుజాధముఁ డుద్యమింపఁడే ? 182

మత మనుమాట యీభువన
మధ్యమునం దెపు డుద్భవించెనో
మతిచెడి మానవాధములు
మచ్చర మూని మతాంతరప్రజన్

హత మొనరింపఁ బద్రుధిర
మంతటినుండియు నింతదాఁక నీ
క్షితిపయిఁ గాల్వ లేఱు లయి
సింధువులై ప్రవహించు నక్కటా! 183

పవనమ్ము నిష్పక్షపాతంబుగా వీచి
సర్వమానవుల క్లేశమ్ము వాపు
సలిలంబు చల్లనై స్వాదువై యుప్పొంగి
యఖిలమానవపిపాసా ర్తిఁ దీర్చు
వసుమతి యాత్మగర్భమునఁ బండినపంటఁ
బ్రజ లందఱకుఁ బేర్మిఁ బంచిపెట్టు
నాకాశ మందఱి నావరించి రహించు
జ్వలన మందఱకుఁ దేజం బొసంగుఁ
బంచభూతము లిటు లుండఁ బంచభూత
యుక్తుఁ డగుచేల పక్షపాతోదయుండు
స్వమతపరమత భేదభావమునఁ గాక!
మానవత్వము చావదే మమతకతన? 184

మత మను పాఠుగై కొని య
మానుషకృత్యము లాచరించి యీ

క్షితి జనపాళి చేడ్పడుటఁ
జేసి యిహంబుఁ బరంబు లేక, దు
ర్గతివశమయ్యెఁ; దత్ప్రహాన
గంధ మెడందను బొందియుండు చో
మతములకున్ మతస్థులకు
మాన్యత సేకుఱి యుండకుండెనే ? 185

భిన్నమతంబు లన్నిటను
భేదవిహీనసమానభావసం
పన్నవిశేష మారసి, 'సె
బా !' సని మెచ్చుట మేలు, భేదముల్
వన్ని మనుష్యజాతి నొగి
వర్గసహస్రమొనర్చి మానవా
భ్యున్నతిఁ బాడుసేయు మత
మున్ మతమే, మృతిగాక జాతికిన్ ? 186

మత మగు ధర్మనిర్వహణ
మానితవృత్తి ; తదీయధర్మమున్
హత మొనరించువాని మత
మా నొక నిలిమునుంగు వాని, కా

మతకర్త మానవాసురుఁ డ
మానుషకృత్యము లాచరించు నా
పతితునికన్న మిన్నయగు
వాస్తవనాస్తికుఁడే ధరాస్థలిన్. 187

ఏమతమందునైనఁ బర
మేశ్వరుఁ డొక్కఁడు; వానికే సదా
నామశతంబు వెట్టుచు న
నంతవిధమ్ముల భిన్నభిన్నులై
యీ మనుజు ల్భజింతు; రిది
యెంచక నామము మాఱునంతనే
సామియు మాఱు నందు రీ జడ
జన్ములు నేఁటిమతప్రచారకుల్. 188

మాఱు నుపాధులతోడుత
మాఱం జనదాత్మ; మతము మాఱెడునంతన్
మాఱునె తత్పరమాత్మయు ?
మాఱెడు మాయయె, పరమము మాఱ దొకపుడున్.

ముమ్మొగమ్ములకాచఖండమ్మునందు
రవికిరణ మొందు భిన్నవర్ణములఁ దోఁచు

పగిదిఁ గేవలపరమాత్మ ప్రతిఫలించు
మూఁడుమూర్తులునాఁగఁ ద్రిభువనములను. 190

నగ లవి వేర్వే ఱయినన్
నగలం గలమేలిపసిఁడినాడెం బొకటే;
తగు నట్టు లఖిలమతములు;
భగవత్తత్త్వం బొకండ పలుమతములలో. 191

నాల్గుదెసలనుండి నగమెక్కునరులకు
భిన్నదృశ్యములు లభించుచుండు
నగశిఖరముఁ జేర నందఱ కేక మా;
నదియ భిన్నమతగతానుభూతి. 192

ఆకాశస్థలినుండి జాఱిపడు తో
యం బుర్విపై నాపగా
నేకంబై ప్రవహించి మించి తుద ము
న్నీ రొందుచందాన భూ
లోకస్థాయి సమస్తదేవపరమా
లోకార్పితోద్యన్నమో
వాకానీకము దత్పరాత్పరునకే
ప్రాప్తించు నిక్కంబుగన్. 193

ఆపరమాత్మసత్యసమ
యజ్ఞత యాను మతంబు ; భూప్రపం
చోపరి నిద్ది కా దనున
దొక్కమతంబును లే, దిఁకేలొకో
కోపముఁ దాప మన్యమత
కోవిదులం గని ? యేకలక్ష్యదీ
క్షాపరులౌచు నందఱుఁ బ్ర
శాంతిని సాధనసేయు టొప్పదే ? 194

ఆలలితైకలక్ష్యమున
కంచితకర్మ, మనూననిష్ఠ, స
చ్ఛీలము, సత్యభాషణము,
జీవదయాపరజీవితంబు, ను
ద్వేలవిరక్తి, భక్తి, గురు
దీక్ష, వదాన్యత, యాగయోగముల్
వేలకువేలు ధర్మములు,
వేవురు వోవఁగ వేయి మార్గముల్. 195

త్వరగా గమ్యస్థానము
దరిసెడు నొకమార్గగామి ; తడయుచు నీఁక నొ

కర్మరుఁ డగునరుఁ డెన్నఁటికో
పరమావధిఁ జేరనోపుఁ బఖభేదమునన్. 196

పరమపద మొందువారలు
తిరుగ ధరకు వచ్చి నిజముఁ దెలుపమి నెది యా
పరమోత్తమమత మగునో
యెఱుఁగ రెవరు ; నెఱుఁగ నెంచుటే దుర్ఘటమా. 197

మీమత ముత్తమమో కా
దో మీరే నిశ్చయింప నోపనియెడ, మీ
కేమని మతాంతరీయుల
మీమతమునఁ జేర్చికొందురు ? మీకిది తగునే ? 198

ఏమతమున మనువారల
నామతమున మనఁగనిచ్చు టత్యుత్తమ మౌ ;
నేమం బెదియో తెలియక
యేమిటి కీమార్పు ? స్వమతమే శ్రేయం బౌ. 199

'సోదరులు సర్వమానవు,
లాదేవుం డవురు జనకుఁ డందఱు' కను నీ
యాదేశముఁ గొని బ్రదుకుట
యే టివ్యమతంబు, దాన నిహముఁ బరము నౌ. 200

రవిఁగా గేశవుఁగా గణాధిపతిగాఁ
ప్రాలేయభూభృత్సుతా
శివరూపంబులుగాఁ బ్రధానపరుఁగా
సేవింతు రెవ్వాని నీ
భువిఁ, దద్భాస్కరకోటిభాస్వరుని వి
శ్వేశున్, సర్వ విశ్వాత్మకున్
భవదూరున్ భజియింతు భక్తిమెయిఁ గై
వల్యార్థసంసిద్ధికిన్. 201

"శైవుఁ డీతం డని భావించితిని గాని
యెఱుఁగనైతిని కవిహృదయ మింత ;"
"కవిమతోపన్యాస మవనిపాచార్యుల
కుభయులకును నచ్చియుండవచ్చు ;"
"మతసామరస్యసంగతికన్న మిన్నయౌ
సుగతి మానవులకుఁ దగునె యెందు ;"
"సమత సర్వంసహామండలి సహితత్త్వ
మున కెందు ననువొందు మూలహేతు ;"
వనుచు సభ్యులు తమలోన నాడికొనుచు
సందడింపఁగఁ దదుచితసమయమందు
సత్వనిర్ణయదర్శనోత్సాహియైన
యువన కిట్లనె నంతఁ గవీంద్రుఁ డెలమి. 202

# ప్రయోగము

సుజనగణానురక్త! ఋజు
  సూక్తిసుధారసరక్త! సర్వదా
కుజనకథావిరక్త! నయ
  కోవిదసంగతిసక్త! రిక్తదీ
నజనహితప్రసక్త! శర
  ణాగతరక్షణశక్త! వాక్సుధా
విజితబహుప్రవక్త! కరి
  భిద్బలయుక్త! యశోక్త! పార్థివా! 203

చాలును మతవిషయం బిఁక
నాలింపుఁడు నాదుప్రత్యయాంతర్గత మా
కీలక మగువిషయము తడ
వేలా? యేకాగ్రబుద్ధి నేలుచు బాలిన్. 204

వసమై జంతువు తీర్పునిచ్చు నని యే
  వాక్కొంటి, నద్దానికిన్
సిసలౌ హేతువు నాడకున్కి జనతా
  క్షేపంబు వాటిల్లె; నీ
వసుధన్ మానవులై చరించెఁ బశువుల్
  బ్రాగ్జన్మమం దన్న దే

యన శ్రీప్రత్యయమూలకారణము, నేఁ
డాలింపుఁ డాద్యంతముల్. 205

పశుపక్ష్యాదినికృష్టజన్మములఁ ద
త్పాపానుసారంబు దు
ర్దశలన్ మానవు లొందుచుందు రనుస
త్యం బుగ్రతోఁ బాలుతో
నశనాపమ్ములతో గ్రహించితిమి కా
దా ? కొంద ఱి క్లాటచేఁ
బశుజాతిం జనియించు టబ్రమె పురా
పాపానురూపంబుగన్. 206

ఏని పాపకర్మ మెపు డనుభూతమగాఁ
దత్క్షణంబ భూతధాత్రి నతఁడు
మనుజరూప మొంది మలిబామునందునఁ
బుట్టు సుకృతభాగ్యభోగపరత. 207

గతజన్మంబున జంతురూపులగుటం
గాదే ధరిత్రీప్రజా
తతి గోవానరరాసభాశ్వకిటిమా
తంగాది జంతూత్కర

ప్రతిమానప్రకృతు ల్వహింతు రిపుడుం;
బ్రాగ్వాసనాసామ్యసం
స్థితుల న్మించెడుసాక్ష్యము ల్గలవె ? సం
దేహంబు లిం దొప్పునే ? 208

పశుజననంబు మర్త్యగణ
పాపఘటాపరిపాక మౌట, నీ
పశుతతి నొక్కసత్వమును
బ్రాక్తనజన్మకృతాపరాధ దు
ర్వశతం బునర్భవించిన న
రప్రవరుండగు వైష్ణవుండనన్
విశదమొనర్చె నచ్ఛతమ
నీషి భవద్గురువర్యుం డొక్కండే ! 209

జను లిలం బాపహేతువున
జంతువులై జనియింతు రంటయే
చనియెనుగానిం యెవ్వం డొక
సత్వమునేని నరుం డొకండుగాం
గనుంగొనలేకపోయె సరి
గా గురుం డొక్కండ్ను గాక యాపహో

మనుజునిసత్యశోధనస
మగ్రపరిజ్ఞత మెచ్చ నొసఁగదా! 210

పాపము పక్షపాతపరి
పాలనఁజేయక యేకరీతిగాఁ
దాపముఁ గూర్చు నందఱకు
దారుణభంగిని; జంతుయూపిగా
భూపదమందు వైష్ణవుని
పోలిక శైవుని నుంపకుండునే?
పాపభుజంగ మొక్కనిఁ గ్రొ
వ్వం గని యొక్కనిఁజంపఁజూచునే? 211

ఈపశుజాతియందు నుప
యింతురు శైవులు వైష్ణవాదులున్
బాపము లాచరించుటను
బ్రాగ్భవమందునఁ; గాని దీనిలో
నేపశు వెవ్వఁడో యఘము
నెప్పుడు దేని నొనర్చి పుట్టెనో
చూపఁగఁ జెప్పఁగా వశమె
సూటిగ మాదృశులైనవారికిన్. 212

ఒకవిషయంబుమాత్ర మన
నొప్పును, రూపము మాఱిపోయినఁ
బ్రకటమతానురోధచిర
వాసనల స్వాదనాడ రేమతా
స్త్రీకులును నిప్పు డీపశుత
తిం జనియించి; మతాచ్ఛవాసనా
నికరము నొందుజీవు లవ
ని న్మతవాదముఁ దీర్చు టబ్రమే? 213

వాసన లొందవో, జనుల
వైఖరి జంతువు? లెందుఁ బ్రాణి నే
వాసన వాసియుండ దను
బ్రాక్తనసూక్తము రిత్తవోవునే?
వేసము మాఱు నో గుణము
వీడునె! పాపహాతుండు జంతువై
గాసిల నందు వాసనలు
గాఁపురముండుట సాజమేకదా! 214

వసుమతి జంతుజన్మలగు
వారలవాసన లంతరించునే?

యెసఁగెడి తీపి బెల్లమున
నిక్షువురూపము మాఱిపోయినన్ ?
బసిఁడి యనేకరూపముల
పాల్పడినం దనవన్నెవాయునే ?
కొసరఁగ నేల ? ప్రాణిజతఁ
గూడి వసించెడు వాసనావళుల్. 215

ఇతిహాసంబులలోఁ బురాణములలో
నెన్నేనిఁ దార్కాణముల్
బతిగూర్పంబడలేదొ ? జంతువులు వి
స్పష్టంబుగా వాసనా
స్థితులన్ వ్యక్తముచేసిన, ట్లపుడు సం
దేహాతిదూరంబులై
క్షితి నీనాఁట నసంభవంబు లగునే
జీవాత్మసంస్కారముల్. 216

చూపెడు నిప్పుడేనిఁ గడుఁ
జోద్యముగాఁ దనలోనివాసనా
టోపము నప్పుడప్పుడు చ
టుక్కున నొక్కొకజంతు వేడనో

యేపగు క్లిష్టదుఃస్థితి, ని
హీం యని జంతువికారచేష్టగా
నాపని నెంచి మానవుఁ డ
హంకృతిఁ బెంచుక యీసడించెడున్. 217

సునిశితసత్త్రధారు లయి
క్షుద్రమతిన్మృగయావినోదులై
దనుజసమానులో జనుల
దౌష్ట్యభయంబు ప్రధానహేతువై
చనుటను, నాలకించుట క
శక్తములౌటను, వాసనాప్రద
ర్శన విరమింప వాసనలు
జంతువులన్ 'నహిం' యంట న్యాయమే? 218

వాసన లొందియున్ జనుల
వైఖరి నాత్మమతప్రచారముం
జేసి మతాంతరీయులను
స్వీయమతస్థులుకాఁగఁ గ్రౌర్యవి
న్యాసము లాచరింపవు, స
నాతనధర్మనిబద్ధజీవితో

ల్లాసపక్షిష్టజీవులు బ
ళా! మృగముల్; తగుటేర్పు నీయవే? 219

పశుపతిని బాలగోపాలుఁ బ్రస్తుతించి
పశువివేచనశక్తినిఁ బరిగణించి
పశువిసరమందు గౌరవభావ ముంచి
పశుగణము నిఁకఁ దీర్పడ వాంఛసేతు. 220

జంతువులార! మున్ను నర
జాతికిఁ జెందినవారలయ్యు, మీ
రింతయు మానవాధిగత
హీనగుణోత్కర మూనఁబోక, సు
స్వాంతసమేతజీవితము
సల్పుదు రిప్పుడు; మీకు సుంతయున్
గొంతులు నూలుపోఁగులను
గోసెడిమానవకోటి సాటియే? 221

ఋతుకాలమునఁదక్క నితరకాలంబులఁ
గామాతురత లేనిగరిమ నుండి
తతసనాతనధర్మతత్త్వంబు నేఁటికిన్
నాల్గుపాదంబుల నడపుచుండి

యిచ్చకంబును బుచ్చి నిచ్చ లెవ్వోచ్చనైనఁ
బల్కినపల్కనే పల్కుచుండి
తనివి ధనమ్ముగా వని నివాసమ్ముగా
స్వేచ్ఛావిహారమ్ము సేయుచుండి
శాశ్వతంబుగ నొక్కవేషంబుఁ బూని
మానవుల కున్నమతములమమత మాని
ఏషణాత్రయవిరహితహృదయ మూని
మనెమునిఁగా కేడ, మనుజులమనికి యేడ ? 222

మీవిశ్వాస, మమాయికత్వమును, నో
ర్మిం, బేర్మి, నిర్దంభస
ద్భావాలంబితజీవితంబు, బలమున్
వైవాహికస్వేచ్ఛయున్
మీవాత్సల్యముఁ, దుష్టి, పుష్టి, మనుజా
నీకంబ దెట్లొందు ? వ
న్యావాసంబునఁ దల్లకిల్లిందులఁ దపో
భ్యాసంబుఁ గావించినన్. 223

అవతారంబులు దాల్చుపట్ల నరరూ
పాన్వితుఁడైనట్టు లీ

భువి మీరూపములున్ ధరించె హరి పెం
పుం జెంద మీజాతి; త
ద్దివిజుల్ సైతము మర్త్యులట్లు తొలి మ
స్త్రీమ స్తముం గొల్చుటే
యపుగా సాక్ష్యము మీప్రశస్తికిని మీ
యాధిక్యసంప్రాప్తికిన్. 224

మనిసన్ బ్రమందిన నొంచె మీపిలుప; రో
మా లెమ్ములున్ గొమ్ములున్
నెనడు న్నంజుడఁ జర్మముల్ నఖములున్
నిత్యోపయుక్తమ్ములౌ
మనుజశ్రేణికి మీర లీల్గినను; నా
మ్యం బున్నదే మీకు నీ
జనజాతంబున కేపరిస్థితిని ? — మీ
జన్మంబు ధన్యం బహో ! 225

శైవుఁడు వైష్ణవుం డనక
సర్వజనావళి నేకరీతిగా
భావనఁజేయుచుం బ్రదుకు
వారలు మీరలు—ద్వేషి చంపునా

శైవుని వైష్ణవున్ సరిగ;
సాదు సుధారస మిచ్చి పెంచు భూ
తావనిఁ, బక్షపాతరహి
తాత్ములు మీకు సరుల్ సమానులే? 226

ఒకకాలంబున మీరుఁగూడ సరులై
యుంటంగదా, మానవ
ప్రకరార్థం బురుసామరస్య మనుకం
పం జెంది యీనాఁడు మీ
సుకమున్, స్వేచ్ఛను, సత్త్వముం, గలిమి, న
స్తోకాత్మలన్ సైతమ
త్యకలంకక్రియ ధారవోయుదురు మ
ర్త్యప్రోన్నతిం గోరుచున్. 227

కొట్టినఁ దిట్టిపోసినను
గోపముఁ దాపము నొందఁబోక, యె
ప్పట్టుననైన మారునుడి
వల్కక శాంతమనఃప్రవృత్తిమై
చెట్టులునైన స్వార్థపర
జీవులునైనను మానవాళికే

మెట్టుకు మేలు సేయుమిము
మించినస్వార్థపిదూరు లుందురే ? 228

మీకష్టార్జిత మాసఁజేసి యకటా !
మి మ్మేఁచియుం దోఁచి భో
గాకాంక్షన్ గసపుప్రాప్తి మీ కిడుచు మీ
గాసార్థమై పెద్దలా
లోకుల్ మీ కపకారులైన నుపకా
రుల్ గాఁగ నేపారు స
త్త్వాకారమ్ములు మీరు మీఋణము వా
యన్ శక్యమే మా కిలన్ ? 229

చీకుం జింతయు లేక కాననమునన్
స్వేచ్ఛావిహారతిం జెంది యె
ల్లో కాలంబునుబుచ్చుమీరు మృగయో
ద్యోగార్థమై మానవా
నీకం బేగఁ దదీయకేళి దనుపన్
నిర్వాణముంజెందుత్యా
గాకారమ్ములుమీరు, మిమ్ము నుతిసే
యన్ శక్యమే మాకిలన్. 230

ఆఁకలి కేదియో మెసవి
యంబువులం దగదీరఁ ద్రావి, యే
దో కుంజమూలవాసమున
నుత్తమ జీవిత మూని, దైవత
ప్రాకటవాహనంబులయి
ప్రాంచితమానవసేవఁ జేయుస
త్త్వాకృతులైన మీ కీల మ
తార్థవిచార మసాధ్య మానసా! 231

బరువుల్ మోయుచు వాహనంబు లగుచున్
బాలిచ్చుచున్ సేద్య ము
ర్వ్వరఁ గావించుచుఁ బాదరక్షలకుఁ జ
ర్మం బిచ్చుచున్ భుక్తికై
యెరువుం గూర్చుచు మమ్మిలన్ మనుచు మీ
కేతీర్పు నేఁ డిచ్చినన్
శిరసాధార్యము శైవవైష్ణవమత
శ్రీయుక్తజీవాళికిన్. 232

మతమున శైవవైష్ణవు ల
మందవిరోధనిమగ్నులైరి, త

స్మృతికలహాపనోదకృతి
మానవసాక్ష్యముకాకపోయె, నీ
క్షితిపయి మీ రమర్త్యహిత
జీవులు, తీరుపునీయఁగల్గుమీ
ప్రతినిధి నంపి యీతగవు
వాపుఁడు సత్త్వములార ! వేఁడెదన్." 233

అని కవి కూర్చుండెను దన
కనకాసనమునను గురునికట్టెదుటఁ గర
ధ్వనిఁజేసి సభ్యు లస్మిలిఁ
గనుచుండిరి దిక్కు లోకమృగమురాకకునై. 234

అంత స్వాంతగ నొక్కపిలి చని తా
తాచార్య మేఁ బ్రాకి, యా
స్వాంతర్భాగమునం దెసంగుమతిచి
హ్నం బై సన్నాముమ్ము సం
భ్రాంతి స్నేహానముం బొనర్చుటనె త
త్ప్రాంతీయు లద్దాని సీ
మాంతం బాసభనుండి తోలిరి గురుం
డాశ్చర్యముం బొందఁగన్. 235

గవ్విరి కొంతమంది, మఱి
నవ్వక నవ్విరి కొంద అందులో
నెవ్వగఁ గొంద ఱొంది, రిఁక
నెవ్వగ నొవ్వక నవ్వ నవ్వకే
దువ్విరి కోరమీసములు
దోర్బలభద్రులు గొంద, అంతటన్
జివ్వన రామలింగకవి
లేచి యిటు ల్వచియించెఁ దత్సభన్. 236



## ప్ర శం స

"క్షితివర ! కృష్ణరాయనృప
శేఖర ! యాంధ్రమనోబ్జభాస్కరా !
మతకులజాతియుగ్దురభి
మానవిహీన ! సమ స్తశత్రుస
న్నుతపరిపాలనా ! నవవి
నోదవిలోల ! యశోవిశాల ! ని
ర్జితపరిపంథిమ త్తగజ
సింహా ! నృసింహా ! శ్రితక్షమాశమా ! 237

నాకె విజయంబు గలిగె, నీనాఁటనుండి
వైష్ణవమతప్రచారంబు వదలి ప్రజల
కేమతము సమ్మతమొ వార లామతమ్ముఁ
బూన విడువంగవలయు నీపై ని మీఁరు. 238

ఇటు కాకెం కెటు తీర్పు జంతు విడుఁ, దా
నింతేని వాదించునే ?
త్రుటిలో వైష్ణవపుండ్రము న్గదిసి, ని
ర్మూలించి యద్దాని, నా
నిటలంబందలిభూతిరేఖలను మా
నెం, జూడుఁ; డీతీర్పు బా

సట నాబాసకు ; వైష్ణవాళిపిచికి
త్సాహేతు వీం దుండునే ? 239

నామము వైష్ణవాంకము స
నాతనభస్మము శైవచిహ్నవహా
నామము వాపి భస్మ మవి
నాశ్యమునా విడి శైవవైష్ణవ
స్తోమవివాదముల్ సమయఁ
జోద్యముగా నొకతీర్పు నిచ్చి, భూ
సీమను మార్గనిర్ణయముఁ
జేసెఁ జివాలునఁ జీలి మేలుగన్. 240

ఇదియె స్వతంత్రసత్వ మగు
నిద్దియె పాలించుపాయశాలి, యి
య్యదియ యదృష్టజీవి, యిది
న్యాయవరం బగు న్యాయమూలమై
కదుకొని కీర్తిఁగాంచుఁ జిర
కాలమునుండి చతుష్పదాళియం
దిది మనపూర్వపుణ్యమున
నే యిట వచ్చెను దీర్పుసేయఁగన్. 241

ఏనుఁగు నిందుఁ, డాయెలుక
నెక్క గజాననుఁ డిట్లు జంతుసం
తానము దైవతమ్ములకుఁ
దత్తడులౌచుఁ దలంకుఁగాని, యె
వ్వానికి లోఁగి యుండక ప్రి
పంచమునందు స్వతంత్రజీవియై

తాను జెలంగు నోతువ్వు-యు
ధాతథబోధ మొనర్చు టబ్బ్రమే ? 242

కల విద్యం దగనేర్ప ని స్వొడిచెదన్
గాకున్న భక్షింతు నం
చులివు ల్సేయని నెన్నడల్, దమములో
నొప్పార వీక్షించు చూ
పులు, వేటాడపట్టి, నేర్చి-మెల్లఱచి, యే
పుంజూపి పై కొన్న కో
ల్పులినే తాఁ గికురించి చీలి బ్రదికెన్
భూమీరుహారోహణన్. 243

ఇలుగట్టం జనలే, దొకండుఁ గొనలే
దేనాఁడు నెందేని భూ
స్థలిపైఁ దాను వసింపఁ, గాని నవర
త్న ప్రాంచితాంతఃపురం
బుల నిచ్చారతిఁ బన్నోకించు విలస
ద్భోగాతిభాగ్యంబు ని
స్తులరీతిం గొను గండుమండలి బుధ
స్తోత్రాతిపాత్రంబుగన్. 244

పసి నొకనాఁటనైనఁ గొను
భావము నొందుట లేదు, దానికిన్
గసవు నొకప్పుడైన నిడు
కష్టముఁ జెందుట లేదు, కాని యీ
వసుధ సుధారసం బెప్పుడుఁ
బానముఁ జేసెడుదివ్యజీవితో

ల్లసనవిహారరహారి జహా
రం, బిల దానియదృష్ట మల్పమె ! 245
తమతమ దైవతమ్ములకుఁ
దత్తడులై చనఁగోర జంతుజా
తము, నది బానిస మ్మనుచు
దత్పృషదంశక మొప్పమిన్ బ్రకో
పమున బిడాలదర్శ మతు
భం బని హిందువు లందు, రట్లుగా
కమరునె యిట్టినింద యెట
నైననుగాని విదేశసీమలన్. 246
ఆమార్జాలకిశోరధర్మగతదీ
వ్యత్కీర్తి సంచారియై
యే మార్గమ్ములనో డాఁగునాత్మజుల న
న్వేషించి సంధించి సు
క్షేమప్రాంతముఁ జేర్చు హేతువున వా
సిం దైవతం బంచుఁ దా
కీమార్జాలముఁ గొల్వరే జనము లా
"యీజప్టు" దేశంబునన్. 247
చంద్రప్రస్తరరాజనిర్మిత నిజ
స్వాతంత్ర్య దేవీ మహా
సాంద్రాకారము చెంత నోతువును భా
స్వద్రీతి శిల్పించి ని
స్తంద్రప్రక్రియఁ గొల్వరే నతిసహా
స్రంబూని "రోమీయు", లా

యింద్రాది త్రిదశాళికేనిఁ గలవే
 యీ భోగభాగ్యోన్నతుల్. 248
నీరములార్చి నెమ్మెయిని
 నీటుగ దువ్వుచుఁ బాలునోగిరం
బారడమూని వెట్టుచు ని
 జాంకతలంబున బుజ్జగించుచున్
ధారణి నాత్మసంతతి వి
 ధంబునఁ బక్కలఁ బంపఁజేయరే
వారిజలోచనల్వినుత
 పశ్చిమదేశములం ద్రిశంకువున్. 249
ఓతువులున్న యింట నొక
 యుక్తవయస్కుని బెండ్లియాడఁగాఁ
గూతులనిచ్చు హైందవుల
 కుం దగునే జహారంబుఁజూచి పె
న్రోతనుగొంట, స్వాశయ వి
 రుద్ధము కాదొకో తత్ప్రవృత్తి, ని
ష్ఠాతుకనింద సల్పి యెరి
 యించుట పాడియె సాధుజీవులన్. 250
అపకువఁజూపుచుం-జడుల
 యల్లరిసైచుచు, దూరసీమల
న్వాడిచినవేగఁ గ్రమ్మఱుచు,
 నిద్దురమానుక తాను కూరుకుం
గుడిచెడు వారి హాయిఁ జెడఁ
 గొట్టక శేలను సద్దులేని నె

న్నడఁజని చీలిమూషిక గ
ణమ్మును బట్టి జనమ్మునోమదే! 251
నవవధువాత్మభర్తృ సద
నంబును జేరఁగ నేగువేళ నా
"నవరలుఁ" "గోదు" లామెకుఁ బ్ర
సాదనవస్త్రవిభూషణార్థ స
న్నివహాముతో బిడాలము న
నింద్యము నానిడిమెచ్చి పంపరే
శివమయి పాడిపంటలది
చేకురఁజేసెడునన్న నమ్మికన్. 252
నల్లని నెమ్మొయింగలుగు
నాసియె భద్రదమంట యొప్పునే
తెల్లని మేనితాల్పులకు
దిక్కుదివాణము లేకపోనా
చెల్లరె! వర్ణభేదమున
జీవులతత్వము మారనోపునే.
బెల్లముఁ దీయనౌనుకదె
వెల్లనిదేనియు నల్లదేనియున్. 253
ఆదాయంబు నెరుంగకే, శుచిని దా
నావంతయున్బాయకే
యేదారిం దనభామజీవితము హా
యిన్నాగునో యెంచకే
నాదోపాసనతోఁ, సమంచదమృత
స్వస్థాశతోఁజీలి మ

ర్యాదశ్ శుద్ధదిగంబరస్థితి భవ
వ్యామోగ కేళింజనన్. 254

పాపనీకము నన్నిబడాలవధ సం
భావింపఘోరాఘు, మే
పాపవ్యాపృతికేని నిష్కృతిఁదలం
పన్వచ్చు, భాక్తవ్యమా
నీపాపత్రి యవశ్యమంచు స్మృతివా
యిన్విచ్చి ఘోషించు, నీ
శ్మాపీఠమ్మునఁ దత్త్వశస్త్రిఁ గొనెచే
సత్వోతరం బేడియుః. 255

అరుదై కొంపలుద్రివ్వి సంతతము రం
ధ్రాన్వేషణం జేసి, గం
దరగోళం బొనరించి రేయివడ ని
ద్రాభంగము న్గూర్చి, దు
ర్భరకష్టార్జితమైనగ్రాసమును జో
రప్రక్రియందోఁచి, యీ
నరులన్ వేచువృషాసురప్రకరసై
న్యంబు న్నివారింపఁగన్. 256

ఏకాదశావతారం
బాకాంక్షునుఁదాల్చి వచ్చె హరి జహరంబై
కాకున్న బాలువెన్నల
నేకాంతమునం దిరిశంకు వేలా కొర్రిలున్ ? 257

మురళీనాదసమానసుస్వరముతో
ముద్దారు రూపమ్ముతోఁ

బెరుగుం బాలను వెన్నఁ గ్రోలుమతిఁ గా
 ద్రేపల్లె గోపీజనో
త్కరగేహాటనసక్తిఁ, నటనతోఁ
 దారాడు మార్జాల మా
హారియో, యాయవతారమో యనుట భా
 వాతీత భావంబొకో. 258

ఈయవతారమం దల ర
 మేశుఁ డునంచితవిశ్వరూపలీ
లాయుతవృత్తి సర్వదిశ
 లన్ నిజదర్శన మిచ్చి లోకపీ
తాయుతిపర్వమాచుఁ గులి
 శాయుధతుల్యనఖోగ్రశక్తిల
బ్ధాయబలైకజీవనవృ
 షాసురసంహతి సంహరించెడున్. 259

సారితశక్తి నై దుపది
 సల్పి నుతింతుఁ బయోరసామృతా
హారినిఁ, బుండరీకసదృ
 గాకృతిధారిని, నండజాత సం
హారిని, శబ్దశూన్యగమ
 నాద్భుతచారిని, స్వీయదృక్తమో
హారిని, తద్వృషోత్కటవి
 హారవివర్ధనయోగహారినిన్. 260

అని కవి యాడ హాసకలి
 తాననుఁడై యువనీశుఁ డాడె నీ

యనుపమయు క్తికిన్ సరస
హాస్యకళాసముదారశక్తికిన్
మన మలరాదే; ముం దనిన
మాటను సూటిగ నిల్పుకొంటి వే
యనితరసాధ్యచిత్రకృతి
నబ్బుర మందఁజు నింద నొందఁగన్. 261

తతకవనధార పరిహాసధార లనెడు
ద్వివిధధారాసమన్విత మవ్వ ద్వితీయ
జీవిత నిశాతహేతి; భంజించు నదియ
నరదురాకృతవిషలతోత్కరముఁ గరము. 262

సమ్మితత్రితయమ్మున సరస మగుచు
మిన్నయైన తృతీయసమ్మితము నితర
రసకృతులఁగాక పరిహాసరసనియుక్త
కృతిని సాధించు లోకసంస్కృతిఁ గరంబు. 263

అవిరతవాహినీసదృశ
హాస్యసుధారసపూరదూరమా
కవనరసాంబురాశిగత
"కంకణ" మువ్వన యాట, లోచనో
త్సవమయి తద్రసగ్రహణ
దక్షపిపాసను దీర్చఁజాల; దీ
భువనమునందు హాస్యరస
పోషిత భాషితమే కృతార్థమా. 264

మ. రువ్వుం గూర్చును ముక్తిం దార్చును సదా
మోదంబుం జేకూర్చు, ని
ర్భరశోకంబు నడల్చు, సంభృతసభా
పర్వంబు సంధించు, దు
స్తరకార్యంబుల నుత్తరించు, హితమార్గం
దత్కర్తకున్ భర్తకుఁ
బరిహాసంబు రసైకరాజమగుచున్
బ్రఖ్యాతవాగస్త్రమై. 265

చిరజీవస్థితి దాయి, సర్వ జనతా
స్నేహానుసంధాయి, సుం
దరదాంపత్యసుఖప్రదాయి, పటుదూ
త్యప్రక్రియాసిద్ధి కా
దరు, వారోగ్యవిధాయి, సంతత లస
త్సంతుష్టినిర్మాయి, యీ
పరిహాసంబు రసైకరాజమగుఁగా
ప్రఖ్యాతవాగస్త్రమై. 266

గురుయంత్రంబును స్నేహ మేపగిది సాం
గోపాంగమున్ స్నిగ్ధస
త్వరసంక్రామము నొందఁజేయునో, యటుల్
దౌర్జన్యమాలిన్యబం
ధురసంఘంబును సంస్కరించి గుణవి
ద్యోతాత్మముం జేయు, నీ

పరిహాసంబు రసైకరాజమగుచున్
ప్రఖ్యాతవాగస్త్రమై. 267

ధరణిన్ వాదభయాగ్రహానునయఖే
దప్రార్థనాదండనా
దరసంశక్తుల కత్యసాధ్య మగు దు
ర్దాంతోగ్రదుర్వృత్తి, నీ
పరిహాసంబునఁ జక్కఁదిద్దనగు భా
స్వద్రీతి నస్త్రంబుగాఁ;
బరిహాసంబు రసైకరాజమగుఁగా
ప్రఖ్యాతవాగస్త్రమై. 268

వెరవుల్ వందలు నిష్ప్రయోజనములై
పోవేదువవ్వేళ నా
దురహంకారుని, దాంభికున్, గృపణు, మం
దున్, మూర్ఖచిత్తున్ జనా
దరణీయోత్తమమార్గగాములుగ ది
ద్దం జాలెడుం దద్దయుం
బరిహాసంబు రసైకరాజమగుచున్
ప్రఖ్యాతవాగస్త్రమై. 269

అరయన్ వక్తలు వేనవే లిదు నుప
న్యాసాలకన్నఁ ఋషీ
శ్వరసంభాషితధర్మసూత్రగత దీ
వ్యచ్ఛక్తికన్నఁ మహీ

స్వైరు నాదేశముకన్న మిన్నగదురా
చారంబులం దిద్ద నీ
పరిహాసంబు రసైకరాజమగుఁగా
ప్రఖ్యాతవాగస్త్రమై. 270

సరిగా దిద్దితి వెన్నో దాంభికదురా
చారంబులన్ మున్ను నీ
చరితన్ ధన్యత నింతదాఁకఁ బరిహా
స ప్రాస్త్రసంధాయివై
సరికాకుండునె వీరవైష్ణవదురా
చారంబు లీమీఁదటన్
పరిహాసంబు రసైకరాజమగుఁగా
ప్రఖ్యాతవాగస్త్రమై. 271

ఆంధ్రజీవిత సచ్చరితాంతరమున
సరసపరిహాస సత్కళాజనకుఁ డీవు;
పెంచి పాలించి లాలించి పెద్దఁజేసి
తత్కళకుఁ బేరుదెచ్చిన తద్జ్ఞుఁ డీవు. 272

మును పొకఁడైన లేఁ డికను
ముం దొకఁడైనను బుట్టఁబోఁడు మే
దినిపయి నీకు జోడు, పర
దేవత నీ కగు దోడు; సాహితీ
ఘనుఁడవు సత్కవీశుఁడవు
గౌరసభాజనహాస్యసత్కళా

ధనుఁడవు రామలింగకవి !
ధన్యుఁడ వీ వఖిలాంధ్రసంతతిన్." 273

పరిమస్మందిర హేమపంజరములన్
భాసిల్లురాచిల్కల
య్యారె ! "సేబా !" సని పక్షచాలనము సే
యన్, సభ్యు లుత్సాహులై
కరతాళధ్వనిఁ జేయఁ, బీఠముప భూ
కాంతుండు గూర్చుండ, నీ
సరణిం బల్కెను రామలింగకవి ప్రాం
చన్నమ్రభావాత్ముఁడై . 274

"రాజా ! వైభవజితధన
రాజా ! తనుకాంతివిజితరాజా ! విద్వ
ద్రాజా ! ధృతిజిత భూభృ
ద్రాజా ! రాహుత్తరాజ ! రాజకరాజా ! 275

తిరమూ తావకదేశభక్తికి లస
ద్విద్యాసుధారక్తికిన్
పరరాడ్భంజనశక్తికిన్ సకల ది
గ్వ్యాప్తప్రథానక్తికిన్
గురుసేవాస్థిరసక్తికిన్ బుధజనా
కూతప్రియప్రోక్తికిన్
చిరవాంఛాఫలసారభుక్తికి మదా
శీర్వాద మర్పిశ్వరా ! 276

నన్నిటఁ బెద్దఁజేయుచు ఘు
నంబుగ సన్నుతిసల్పి తేవు వి
ద్వన్నుత ! త్వత్కృతస్తుతికిఁ
బాత్రిమ సౌదునో కానో కాని నీ
యున్నతి, నీయుదారహృద
యోన్నతి, సర్వసమత్వబుద్ధి సం
పన్నత, సత్కళాభిరతి
వ్యక్తము లయ్యెను నేఁడు భూవరా ! 277

కవితాశక్తియు, హాస్యరక్తియును ద
త్కాళీప్రసాదంబునన్
దవిలెన్ నాకు సుధాదధిద్వయవిధా
నం దొల్లి, యావెన్క మ
ద్భువసాఫల్యముగా నెసంగె నవి త్వ
ద్వాత్సల్యమూలాన నో
యువనీశా ! పరదేవతార్పణము కా
నౌఁ ద్వత్కృతప్రస్తుతుల్. 278

మతకలహంబు జాతి కవ
మానముఁ బంచును, మానవత్వవి
చ్యుతి నొదవించుఁ, బెంచును ప
శుత్వము; పాలకకీర్తిచంద్రికా
వ్యృతి నడఁగించు, దేశమున
దుస్థితి నించు, మమత్వవృద్ధి సం

భృతి నొదవించు, నజ్ఞతను
భీతి, ననేకత, నావహింపజేయున్. 279

సభ్యత నుక్కడంచు, జన
శాంతికి భంగము నావటించు, దే
శాభ్యుదయప్రయత్నముల
కాకఘటించుఁ రసప్రపూర్ణవి
ద్యాభ్యసనం బడంచు, నహి
తాజికి మార్గము సంతరించు, దే
వాభ్యుపపత్తిఁ ద్రుంచు మత
వైరము దేశమునం జనించినన్. 280

ఆత్మీక్షమ్ము నడంచు హాస్యకృతియుం
చాలోచనన్ సల్పి నే
నేతల్లిల ఘటించినాఁడ; గలదే
యొందేనియున్ నాకు నా
తాతాచార్యున కొండు వైరము విరో
ధాభాసమేకాక ! నా
చేత న్నన్ను క్షమింప రాజగురు నేఁ
జేమోడ్చి యర్థించెదన్. 281

ఇఁక నర్థిన్ ద్విమతస్థు లేకమయి హా
యిం జెంది జీవించుతన్

సకలేశార్పణముం బొనర్చుచు నిజా
ర్చల్; మోక్షముం గూర్చునే
యకటా! యేమతమైన, నేరికి నవి
ద్యావృత్తిఁ దా మానుచో?
వికలానేకత నేకతం గనుటయే
విజ్ఞాన మెవ్వారికిన్. 282

కవిభూపాలక దేశికాఖ్యలను జో
క న్మించి వాచించి త
ద్భువనాభ్యంతరసభ్యసంతతి జయ
ధ్వానంబులన్ సల్పె నా
దివి దిక్పాళి ప్రతిధ్వనించునటు, ధా
త్రీభర్త తా నంత ను
త్సవ మేపారఁగ లేచె నాఁటి కనువా
సందేశమున్ వాకొనన్. 283



# ప్ర భు శా స న ము

గండరగండఁ డాన్నృపతి
  ఖామణి వాకొన నిల్వఁ దత్సభా
మండపమందు సభ్యులు క్ష
  మాపవదోమ్మృత మానునానతో
నుండిరి, నిస్తరంగవిపు
  లోదధి నాఁ దగెఁ గొల్వుకూటమున్
గుండియ లాడుచుండు సడి
  కూడ వినంబడె వారివారికిన్. 284

అంతటఁ దత్ప్రశాంతసమ
  యంబున సభ్యుల నెంచి యిట్లు భూ
కాంతుఁడు శాంతమొంట, నధి
  కారము నొంటఁ బ్రపత్తి నొంటఁ బెన్
బంతము నొక్కచో సహాన
  భావము నొక్కెడ వంత నొక్కచో
వింతగఁ జూపుచుం బలికె
  విజ్ఞతఁ బ్రాజ్ఞత నింగితజ్ఞతన్. 285

"పురజనులార ! యీసమయ
  ముం గొని నేను వచించుమాట లా

దరమున నాలకింపుఁడు, మ
తమ్మొదియైనను బక్షపాత మే
నరమున నాకు లేదు; సహా
యమ్మగు నూపిరి నాకు; లోకు లీ
పరమరహస్య మెంచక నె
పమ్ములు వల్కుదు రజ్ఞతాంధులై. 286

పలుకాడం దలఁపూని వచ్చితి సభా
ప్రారంభ వేళన్ మత
స్థల కస్మన్మతమార్గనిర్ణయము సం
స్తుత్యంబుగా, నేఁటినా
పలు కాలించి మహాప్రసాద మనుచున్
భావించి యద్దాని మీ
తలలం దాలిచి యాచరింతు రని మ
త్స్వాంతంబునం దెంచుచున్. 287

ఈప్రత్యయము నిర్వహింపఁజాలఁడు కవి,
జయము తన దని యాచార్యుఁ డుండ,
శపథమ్ము నెఱవేర్ప సామర్థ్య మగు నాకు
జంకేల యని కవీశ్వరుఁ డెసంగ,

కవి బాస నీడేర్చ నవును స్వాతంత్ర్యమ్ము
తమ కని శైవులు తమక మొందఁ
దొలి వింతపంతమ్ముఁ దుద కెట్లు దీర్చునో
కవి యని సభ్యు లుత్కంఠ నుండ
వారి యాసలు భంగింపఁగోరఁ బోక
మార్గదర్శనలబ్ధి నెమ్మదిఁ దలంచి
యీసమస్యను నిర్ణీతి నింతవనుక
మీరు మన్నింతు రని నన్ను గారవార. 288

మతము లనేకము ల్గలవు
మామకరాజ్యమునందు, నెవ్వఁ డే
మతమును స్వీకరించినను
మాన్యుఁడ యంచుఁ దలంతు, యన్మతా
న్వితుఁడగు మానవుండయిన
నిర్మల శీలవిహీనుఁ డైనచోఁ
బతితుఁడుఁ బాపపంకిలుఁడు
వంచకుఁ డంచుఁ దలంతు నెంతయున్. 289

అరసి మతప్రచారమును
సందడిఁ జేయుట యొప్పఁగాని యె

వ్వారిని మతాంతరాన బల
వద్విధిఁ జేర్చుట తప్పు; స్వేచ్ఛ యా
నరునకు నాత్మ; తద్గుణవి
నష్టజనుండు జడుండు; దేవుఁ డా
మొఱకున కబ్బునే భవవి
మోచనయోజనఁ దాను నోచునే ? 290

ఇల మీామత ముత్తమ మని
తలఁచి తనిసి వచ్చువారి తద్‌జ్ఞతఁ గని మీా
రలు మీామతములఁ జేర్చక
వలవదె ? బలవత్ప్రయోగపద్ధతి తగునే ? 291

ఏనరు దృష్టిమాంద్యమున
కెట్టి "సులోచన" మూను టొప్పునో
యానరుఁ డా "సులోచనము"
నందిన సత్యము గోచరించు, న
ట్లూనక యే "సులోచనము"
నో యొకదానినిఁ దాను బూనుచో
నానయనాన్వితుం డయిన
యంధుఁ డతం డగు సత్యదూరుఁడై. 292

పాలకమతమును గొనవలెఁ
బాలితజను లంట తగదు; వ్యక్తులు స్వాతం
త్ర్యాలోలురుగా వునఁ బ్రజ
లేలాఁతిమతంబునైన నెనయంబోలున్. 293

మతగురుండు గాఁడు క్షితిపతి; పాలిత
జనమతప్రసక్తి సనదు పతికి;
దేశభక్తి, స్వీయదేశాధిపతిభక్తి
ప్రజల కున్నఁ జాలుఁ బ్రభుత నెందు. 293

సకలమతావలంబులకు
స్వాతంత్ర్యము లొప్పు సమానరీతిగా
నొకనికి హక్కు లెన్ని కల
వో కల వాతని కన్ని బాధ్యతల్;
సుకరము రాజ్యపాలన ప్ర
జోత్కర మిద్ది గ్రహించి మన్నచో;
వికలత నాశహేతు వగు
విష్ణువె రాజ్యము సేయుచుండినన్. 295

భద్రావాప్తి నెసంగుశ్రై వజనతా
భాగ్యంబు భంగింప, న

స్మృద్రాజ్యంబున వీరవైష్ణవమతో
న్మాదంబు రేఁగెన్ గృహ
చ్ఛిద్రంబై యనుపేక్ష్యమై- యిపుడు ని
శ్చింతం బ్రవర్తించుచో
నుద్రిక్తస్థితి మత్ప్రజానిచయమం
దుద్భూత మహా టబ్రమే ? 296

శైవుల కష్టవిస్ఫుర వి
షాదభయస్థితు లీదినంబులం
దేవిధి నున్నవో తలఁప
స్త్రీం జనియించెడు- వారలుండు, రా
పావకచక్రమధ్యమునఁ
బ్రాఁకుచునున్నటు, శాతకంటక
ప్రావృతశయ్యఁ బండినటు
వజ్రనిపాతనిరీక్ష నున్నటుల్. 297

బలిమిఁ శైవుల వీరవైష్ణవులు దు
ర్వారక్రియన్ దన్మత
స్థులుగాఁ జేయుట వింటిఁ గంటి నొగిఁ గుం
దుం గొంటి నీమాద్రిచేఁ

తలు మన్నింపను వైష్ణవుండనయినన్,
దత్కృత్యముల్ సల్పువా
రల దండింతును దండివోలెఁ బరాని
ర్ఘాత్కీర్ణ్యాచండాహతిన్. 298

ఏతన్మతాంతరీకర
ణాతురకృతిఁ బ్రోత్సహించె నస్మద్గురుఁడౌ
తాతాచార్యుం డని జన
జాతము తలపోసి దుష్ప్రచారము సేయున్. 299

"తాతాచార్యులముద్ర" యన్న యపనిం
ద న్నేఁ డుపేక్షించు-చో
నేతద్రాజ్యమునన్ బ్రచారమగుఁ గా
దే యద్ది లోకోక్తిని
ర్ఘాంతంబై కలకాల మాతని యశో
రాప్యాద్రివిధ్వంసియై ?
తాతాచార్యుఁ డమాయికుం డనుట స
త్యప్రోక్తి ముమ్మాటికిన్. 300

రాజమతమ్ము వైష్ణవము
రండు గ్రహింపుఁడు శైవులార ! పెక

మోజు లభించుఁ బెద్దపద
ముల్ సమకూరుఁ, దిరస్కరించుచోఁ
దే జతి కష్టనష్టపరి
ధిం బడి భ్రష్టత నొంది జీవితం
బోజ వృథా నశింపఁ గను
చుంట ధ్రువం బని భాసఁజేయుచున్. 301

ఆర్జవకృపాణ మొక్కకరమం
దాశామిష మ్మొక్కచేఁ
బ్రోది న్బూనుచు నాది యందు, మఱి పోఁ
బోఁ నొక్కదార్జవ్య క
ర్మాదేశంబున వీరవైష్ణవులు ము
ద్రాన్వీతులం జేయ, ని
ర్వేదాక్రాంతుల శైవులన్ గొనెద రా
వేశప్రవేశంబునన్. 302

తనదగు వైష్ణవమ్మును య
థార్థముగా మది విశ్వసించి వ
చ్చినజన మంచు నమ్మి భుజ
సీమల ముద్రలువైచి పంపుచుం

జైను గురుఁ డంతెకాని ప్రశ్న
టీకృతదోషము వానియందు లే,
దనుఁగగుశిష్యకోటి యిటు
లక్కటు తఱ గికురించు టెంచునే! 303

'దాసోఽహ' మ్మని యంటకాని యకటా!
తచ్ఛిష్యదుష్కృత్యముల్
వీసంబైన గురుం డెఱుంగ ననఁ దై
న్వోళన్ బ్రీతికారదు
గ్భసాంద్రుం డయి జైవులంపు నొకఁడున్;
బ్రీతాత్ముఁ డౌఁగాని తా
నేసందేహము దేశికుండు గొనఁ డా
మింతేని యందున్నదే? 304

జపమందుం దపమందు బోధనమునన్
స్వాధ్యాయమందున్ రమా
ధిపసేవం గవితం బురాణమున న
ర్థిం గాలముం బుచ్చి మో
క్షపరుం డైనగురుండు శిష్యకృతదా
గ్జన్యానుసంభావనా

విపరీతాత్మవికారవృత్తిఁ జనునే
విద్యావిరామావస్థయె. 305

అంతేవాసులతప్పు తద్గురువునం
దారోపితం బౌను భూ
కాంతుం గూడు ప్రజాకృతాఘ మటు లో
కంబందు మద్దేశికుం
డెంతో ధర్మవిదుండుఁ గీర్తియుతుఁడౌ,
నేతాదృశాకృత్యముల్
స్వాంతంబందున మెచ్చునే ? తెలియుచోఁ
బ్రచ్ఛన్నసత్యస్థితుల్. 306

"తాతాచార్యునిఁ దండ్రిగా గురువుగా
దైవంబుగా నెంచుతేఁ
డాతం డాగ్రహ మొందునేమొ" యని య
త్యాచారముల్ సల్పుశి
తాతాచార్యుని శిష్యకోటినిఁ బ్రభు
త్వస్థానికోద్యోగులున్
భీతిం బొంది యుపేక్ష సేయుటఁ బ్రజా
విద్రోహ మిం దేర్పడెన్. 307

నేనే కాని మదీయ బాంధవుఁడె కా
నీ చేసికొంటేనిఁ గా
నీ నేరం బొనరించువాఁ డెవఁడుగా
నీ దండనార్హుం డగున్
“నీ, నా” భేదము ధర్మశాస్త్రమున క
న్నే ? దానముం గాల్చువోఁ
డా నూహించునె ‘రాని’ ‘మాని’ యను భే
దం బగ్నిహోత్రుం డిలన్. 308

తనవారుం బెఱవారు నే రనెడి భే
దవ్యాపృతిం జెంది యొ
క్కనిఁ గట్టుం మఱి ముక్క యొక్కనికిఁ గాఁ
గా దుర్వ్యథల్ సల్పుచున్
జనునుద్యోగి ప్రభుత్వమారకుఁడు, రా
జద్రోహి, దేశారి; యా
జనుఁ డుద్యోగపదచ్యుతుం డగుట ని
స్సందేహ మేనాటికిన్. 309

ఉద్యోగార్థుల జాతులున్ మతము లే
వో యంచుఁ దర్కింపకే

విద్యాబుద్ధులు గల్గువారిఁ దగ న
న్వేషించి రావించుచుఁ
ప్రోద్యద్ధర్మము లేని, కాతనిప్రభు
త్వోదారకీర్తిచ్ఛటల్
ప్రద్యోతించును వారిమూలమున, సా
మ్రాజ్యంబు వర్ధిల్లెడున్. 310

ఇంతటినుండి యీపురమి
నెందున నన్యమతాపహాతాపసి
ద్ధాంతము లుండరాదు; మత
తత్త్వము ప్రేమవిరుద్ధమానె? సు
స్వాంతవిభాసిసోదరుల
చాడ్పున సర్వమతస్థు లుండుచోఁ
జింతలులేక యీతెలుఁగు
సీమ వెలుంగదె భౌమనాకమై. 311

బలిమిన్ వైష్ణవ మూని బాధపడువై
వవ్యక్తు లీనాఁటనే
లలిమై వైష్ణవ మింకవీడి స్వమతా
లన్ బూనఁ బోవచ్చు; రా

జలసచ్ఛాసన మిడ్డి; దీని కెదురై
నాగించుయత్నమ్ము ని
ష్ఫల, మెవ్వాఁ డటు సేయునో యతఁడు శ్
వాపాత్రి మా నియ్యెడన్. 312

వలసపోయినవారలన్ బిలిచి మఱల
వారి వారిండ్లలోన నివాసమొసఁగి
యాస్తిఁ గోల్పోవువారల కాస్తు లిచ్చి
గతము మఱపించి యేలుచే క్షితిపనీతి. 313

గౌతమీకృష్ణాపగామధ్యభూమిని
గెలిచి సామంతరాజులను నిలుప
తతపూర్వకర్ణాటదక్షిణోర్విని గెల్చి
మూఁడుకోటులుకప్పమును గడింప
తొండమండలము చిత్తూరు జింజీదుర్గ
ములు మలయాళసీమలను గెలువ
మాడుగుల్ పురముఖ్యమాన్యప్రదేశాలు
గెలిచి జయస్తంభములను నాట
కటకపురిఁ గాల్చి యోడింప గజపతులను
నాయమూర్దుర్గము జయించి రహిఁజెలంగ

దిగ్విజయయాత్రి నేఁ జేయుదినము లందు
నీమతాహితవృత్తి జనించె నిందు. 314

కలఁగి రహస్యవిచారణ
సలిపినపయిఁ దేలె నీవిషయములు—శిష్యుల్
తులువతనమ్మునఁ జేసిన
కలుషము గురువునకు నాకుఁ గలిగెం బెలుచన్. 315

ఆకతంబున నింతగా నాడవలసి
వచ్చె, నిఁక నిట్టికలహంబు హెచ్చుకొలఁది
ముప్పు మనరాజ్యమున కెల్లఁ దప్ప దనుచు
మతమహోన్మాదమున్ మాన్పఁ బ్రతినఁగొంటి. 316

వైళమ యీమతాహితద
వంబు సగానరిరాజ్యమందు న
ఖ్మాలలుబ్రాకి పోవుటకు
మున్న తటాలున మేలుకొంటి, నీ
జ్వాలకు హేతుభూతులగు
వైష్ణవవేషుల బందిఁబెట్టి నే
నేలెద రాజ్య మింక క్షమి
యించి గతమ్మును విస్మరింపుఁడీ! 317

ఏనాఁ డాకవిశేఖరుండు సభయా
దీవాదముం బూనెనో
యానాఁ డే ననుమాన మొందితి మతా
త్యాచార మత్యంతమై
యీనాఁటం జనుచున్న దంచు, సమయం
బేపారఁ బ్రచ్ఛన్నతం
బూనంబోయి రహస్యశోధనకళా
వ్యూహంబు నేఁ జొచ్చితిన్. 318

కవి యేదేనిఁ బ్రయోజనంబుఁ గన కే
కార్యంబుఁ గావింపఁ డీ
భువిపైఁ, దాఁ బరిహాసమూలముననో
పోద్యత్కవిత్వప్రభా
వవిశేషంబుననో జనాజ్ఞతను త్రే
వం దిద్దు; నేఁ డిందుఁ దా
నవబోధం బొనరించినందుకుఁ గృత
జ్ఞాత్ముండ నవ్వానికిన్. 319

సమ్మతిఁ దోడై దిగ్గజ
యమ్మున "నప్పాజి" తీర్థయాత్రాపరుఁడై

క్రిమ్మరుటను నేఁ డీసమ
యమ్మున నిట లేమిని హృదయమ్ము కలఁగున్. 320

రాజసభామర్యాదల
కేజడిమముఁ గలుగనీక యుద్ధవిధానన్
రాజిల్లిన సభ్యులగుణ
రాజిని నేఁ బ్రస్తుతింపరాదే యిచటన్. 321

మతవిషయాన నే నని న
మాటకు నన్ క్షమియించి, సర్వోన
న్నతమతమార్గమందున న
నూనగతిన్ గమియింపఁజేసి, శ్రీ
పతికరుణాకటాక్షమునఁ
బ్రాజ్ఞుఁడు మామక దేశికుండు, నా
వ్రతము ఫలింపఁజేయుత మ
వారిగ దీవన లిచ్చి మెచ్చుచున్. 322

తలఁపు లన్నింటి నిజముఖాదర్శమందుఁ
జూపి, తలయూఁపి చిరునవ్వుదోఁప నిలిచి
దేశికుం డంత శ్రీకృష్ణదేవనృపతి
నిట్టు లాశీర్వదించె సహిష్ణుఁ డగుచు. 323

అతులవినాయకాప్తుఁడు, మ
హాసితగాత్రుఁడుఁ, బూతజాహ్నవీ
యుతుఁడు, హిమానురక్తుఁడు, ద
యోదధి, యబ్జవిరాజితుండు, శా
శ్వతుఁడు, ధనుర్ధరుండు, భగ
వంతుఁడు మాధవుఁ డోముఁగావుతన్
క్షితిపతి ! నీ కభీష్టఫల
సిద్ధిచిరాయువు లిచ్చి వేడ్కమై. 324

ఉరుములవలె శంఖమ్ములు
మొరసెను, హారతులు మెఱసె, భూపతిహితమై
తరళాక్షతవర్ష మ్మొగిఁ
గురిసెను దద్క్షణమె కొల్వుకూటమునందున్. 325

రాజును రామలింగకవి
రాజును దగ్గురుపార్శ్వయుగ్మమున్
రాజితరీతి డాయుచుఁ గ
రద్వయచాలనఁజేయ, ముప్వురున్
బూజితకేశవాజశివ
మూర్తులకూటమి నాఁగఁ దోఁచి, వి

భ్రాజితవై భవంబున స
భాభవనంబును వీడి రంతటన్. 326

అహఁగులకు మద్దు లొత్తంగఁ బడఁతు, తెలిమి
మార్గముం జూప వినతసామంతనృపులు,
మేటిమంగళవాద్యముల్ మిన్నుముట్టఁ
గదలి చని రా త్రిమూర్తులు సదనములకు. 327

వెనువెంటన్ సభ నున్నవారలు ముదా
వేశానఁ బాథోధివో
లెను దోస్తో జయవెట్టి, ఛిన్నమగు జో
లెం జాఋపండ్లంబలెన్
జను చాయాడెసలన్ గృహాభిముఖులై
శైవు ల్దమిన్ వైష్ణవుల్
నెనరుం జూపుచు నాసభాభవనమున్
వే వీడి రొక్కుమ్మడిన్. 328

శివకేశవాలయమ్ముల
నవిరళఘంటానినాద మాశల నిండెన్
నవసుమనోర్చల విబుధులు
తవిలిరి సుఖశాంతిసంపదలు వర్ధిల్లన్. 329

కొమ రమరన్ ద్విజాళి తమ
గూండ్లను జేరె సముత్సుకమ్ముమై
కుముద హృదంతరాళముల
కుం భ్రమదంబు ఘటిల్లె, వ్యాప్తమా
తమమును రాజరశ్మి కప
ఘంబును వీడ విచల్చె, భోగ సం
భ్రమమున గంధవాహాగత
వాసనలన్ హరియించె నంతటన్. 330



# ప్రశాంతి

దోసకారితుటుము దోషాకరునితోడఁ
డెల్లవోయి పోవ దిక్కు లెడలి
యినకరావలంబమునఁ దల యెత్తుక
తమ్మియెమ్మెలాడి తమి హసించె. 331

శృంగారరససుప్రసిద్ధరంగం బౌచు
ద్విజనాదకలితప్రదేశ మగుచు
పద్మినీసుషమావిభాసమానం బౌచు
మీననేత్రోత్సవస్థాన మగుచు
కలగాన లసిత సత్కవిరాజియుత మౌచు
మధుపాయిసంచారమార్గ మగుచు
కంకణగణతటిత్కాంతిమంతం బౌచు
విటపిహితోపాంతవీథి యగుచు
హంసదర్శనభాగ్యవిఖ్యాత మగుచు
జీవగణ జీవనాధార సీమ యగుచు
సాంద్ర సుమనోవికాస నిస్తంద్ర మగుచు
నాకసరోవర మాయూర నొప్పమీఱు. 332

తలపై మొలపై నంస
ములపైఁ గడవలను దాల్చి పూఁబోఁడులు హం

సలవలె మయూరములవలెఁ
గలభంబులఁబోలె లలితగతులఁ జనుచున్. 333

ముక్కుపై వ్రేలినిడి యూడఁ ముదిత యొకతె
చెక్కులను నొక్కుకొను చనుచెలువ యొకతె
నెత్తి నోరొత్తుకొని పల్కునెలఁత యొకతె
గుండెఁ జఱచుక మూఁగాడుగోతి యొకతె. 334

బామవిభ్రమముల వీక్షా
క్రమమునఁ జేసన్నల నెదఁ గలభావములన్
గొమరారఁ దెలుపుకొనుచుఁ
బ్రమదావళి సరసి కేగి వచ్చెడు నెపుడున్. 335

రోలంబాలక లాసరోవరతటిన్
లోకాభిరామాయణం
బాలాపించుచుఁ దత్ప్రసంగవశలై
యాక్రోశము ల్పల్కుచున్
మేలంబాడుచు హాసభాసముఖులై
మిథ్యావివాదాఢ్యలై
యాలస్యంబుగ నిండ్ల కేగెదరు తో
యాపూర్ణభాండాళితోన్. 336

అంతకుమున్న వైష్ణవకు
లాంగన లాసరసీజలంబు సం
ధ్యాంతరమందకై కొని ని
జాయతనంబులు సేర, నిష్ప్రశీ
ప్రాంతము శైవభామలు జ
లానయనార్థము చేర నైరి ద
క్కాంతలు సుప్రసన్నత వి
కావిక నవ్వఁగ లేఁతయెండలన్. 337

ఆనాఁ డంతకుముందునాఁటను సభా
వ్యాపారమందైన య
చ్ఛానూనైక విచిత్రసంఘటన ని
చ్ఛాలీల భావించి వ్యా
ఖ్యానంబుల్ పచరించుచున్ శుకపికీ
కాకోల ఘూకస్వరా
ధీనాలాపము లాడఁజొచ్చి రిటు సం
దేహాకులస్వాంతలై. 338

"వింటే! కోడల! రాజుగారిసభలో
వింతన్, సరుల్ గొన్న యా

తంటాలోపలఁ దీర్పు నిచ్చెఁగట తా
తాచార్య్య నామాలు వే
రఁట న్నాకి బిడాలమొక్కటి ! బలే
యాశ్చర్యమా నిద్ది ! వం
టేంటం బొంచెనుదాని కెట్లొదవెనో
యీసాహసావేశముల్." 339

"అనుకొన్నంతయు నైనదా ! తుదకు దై
వానుగ్రహం బయ్యెనా ?
తనబాస న్నెఱవేర్చెనా సుకవి పం
తంబొప్ప నేజంతువై
ననుఁగాని మ్మది తీర్పు నిచ్చెనుగదా;
న్యాయంబు లేకేమి ? యిం
దనుకన్ రేఁగిన వీరవైష్ణవుల ము
ద్రాహింస నిద్రించునే !" 340

"నిద్రింపంజనకేమి ? భూవరుఁడు ని
ర్ణిద్రైకదీక్షారతిన్
ముద్రామూలమతాంతరీకరణ ము
న్మాలింప నూహించి, తా

మాంద్రిన్మీఱిన శాసనంబొకటి ని
ర్మాణంబు గావించె యా
వద్రాజ్యప్రజకెల్ల వాంఛితమత
స్వాతంత్ర్యము న్గూర్చుచున్." 341

"జంతువులందు నోతు వతి
సాధువు, చీమచిటుక్కుమన్న నా
శాంతముఁ జేరఁబాఱెదు; మ
హార్ణవరావ మెసంగు నాసభా
భ్యంతర మెట్లు సొచ్చె? జన
వర్గము నెట్టులు దాఁటె? వింతలో
వింతగు నిద్ది! మున్నెపుడు
వింటిమె కంటిమె యిట్టిచెదముల్?" 342

"పాలన్ వెన్నను నాహరించి యెలుకం
బట్ట న్నియోగించె నీ
నేలం జీలినిఁ దమ్మిచూలి, యిపుడా
నేమంబు మార్పొందెఁ గాఁ
బోలుం, బిల్లులు రచ్చకెక్కి పెను తీ
ర్పుల్ చెప్ప నేతెంచు, నీ

కాలానూనమహత్త్వమో ప్రశయదు
ష్కాలంబు ప్రాప్తించెనో !” 343

“తాతాచార్యుల నెట్లు పోల్చఁగానెనే
తా నాసభాసీమయం
దాతండేయని !_ పోల్చెఁబో, యతనిమో
మందున్న నామాలు ని
ర్భితిన్ సాపము టల్లపిల్లి కగునే?
పిల్లుల్ మహాభల్లుక
వ్రాతంబై విహరించుకాల మిలపై
వచ్చెంజుమా, నేఁటికిన్ !” 344

సభనొగిఁ దీవ్రవాదములు
సల్పిన దేశికుఁడుం గవీశ్వరుం
డభిముఖులౌచు నొంకొరుల
కం దుపవిష్టులుకారె? దేశికుం
డభిముఖుఁడౌట నాసి కెదు
రౌట యసంభవమే? కవీశుఁడే
శుభమని దాని సాలువ ము
సుంగున దాచుకవచ్చి పుచ్చెచో. 345

“అరయం బోకు పతంగ మద్ది యని, చే
లా ! చాలు, నాలింపుమా

పరకాయాన ప్రవేశమొందఁగల శై
వవ్యక్తి యెవ్వండో యా
సరణిన్ వచ్చి తదాకృతింగొని సభా
స్థానం బెట్లో చొచ్చి, త
ద్గురునిం బోలిచి వానినామమును గా
కుంజేసి నాకెం జుమా!" 346

"పరకాయంబునఁ జొచ్చువేల యొకఁ డా
ఫాలాక్షుఁ డేమాయె? నం
దలకుం గన్నులు రెం డొసంగి కొనఁడే
తాఁ గన్నుల న్మూటి నీ
శ్వరుఁడై, భక్తజనాళికష్టముల నో
జం జూడఁడే? చూచి యే
మఱునే? యేమఱియున్న నేరయిన న
మ్మంబోదురే యాతనిన్." 347

"తూలెడు వీరవైష్ణవుల
దుండగముల్ భరియించి, యెంతయో
తాలిమి శైవ లీశపద
తామరసద్వయభక్తి నుంటచే
జాలినిఁబొంది భక్తజన
సంచయరక్షణ సేయు నూహతోఁ

జీలిగ శూలియే యట్టులు
చేసెనుగాని యొరుల్ సమర్థులే ?" 348

"పరమేశాంశజులౌచు నెవ్వ రిలపై
వాసింతురో వారి కా
పరిమాణ్యాదిసమస్తమందు నెపి బ్రా
బ్రహ్మాస్త్రకల్పంబుగా
దరయన్ సత్కవి యీశ్వరాంశభవుఁడే
యౌటంజుమా, నాసి కే
సరిశౌర్యమ్మున నట్లొనర్చెను గవీ
శ ప్రాప్త సత్వాస్త్రమై." 349

"అలుగై నొంపడె పూరిపోఁచ యొకపా
పాత్మాసురున్మున్ను ? భూ
స్థలిపై నంతటిశక్తి పూరి కగునే ?
తత్సాధకప్రాప్త స
ల్లలితాధ్యాత్మికశక్తిగాక ? యిట మా
ర్గాలంబుఁ దా నట్టిదే;
కలదే సాధకశక్తిగాక బలమొ
క్కం డెందు నేసాధనన్ ?" 350

"భాసురమంత్రదీక్షఁ గొని
పండితసత్కవి శిష్టసేవతో

పాసనఁజేసి, దేవి వశ
వర్తినిఁగాఁ గొని వింతచేఁతలన్
జేసి రహింతు కాని కవి
చేయున దింతయు లేదు నమ్ముమా !
గానటబీనటన్ జదువఁ
గాఁ గొననౌను మహత్త్వసంపదల్." 351

"తాడి ముత్తునియలై ధరఁగూల నాడఁడే,
కవితాకళోపాసి కవియొకండు ?
ఆటజాములో పెద్దచెఱు వింక నుడువఁడే,
కవితాకళోపాసి కవి యొకండు ?
బ్రహ్మదండిని ముండ్లు వడిరాల నొడువఁడే,
కవితాకళోపాసి కవి యొకండు ?
అమవస నిసినిఁ బున్నమ రేయిఁ జేయఁడే,
కవితాకళోపాసి కవి యొకండు ?
ఇతర దేవతోపాసనమేల కవికి ?
నమ్మ, వాగ్దేవతోపాసనమ్మె చాలు;
కవిత యద్భుతశక్తియుక్తమ్ముగానఁ
గవి కసాధ్యమ్ముగలదె లోకమ్మునందు ?" 352

"కవనశక్తిగాదు, శివునిశక్తియుఁగాదు,
పరతనూప్రవేశ బలముఁగాదు;

దేవ్యుపాసనైక దివ్యశక్తియుఁగాదు
యుక్తియుక్తమంట యొప్పు నిది" 353

"ఎటు లలవాటుసేయ నటు
లేకడె జంతు వొనర్చు ? సృష్టి సం
ఘటనలు జంతుశాసకళ
ఘాముణు లెన్నియొ ము న్నొనర్పరే ?
యటు కవి వెంకుమాసముల
యం దొగి శిక్షనొసంగకున్న చోఁ
వటువున నిట్లు చేయఁగల
దా, పృషదంశక మొక్కసారిగా ?" 354

"తిరుమణి వెన్నయొ ? ఘృతమో ?
యెరచియొ మీఁగడయొ దధియొ యేమనుకొని, యుం
దురుఖాది నాకె నందువు ?
పరిహాసం బిట్లు సేయఁబాడియె ? ప్రౌఢా !" 355

"కవి నిటు గేలిసేయుట య
ఘంబు సుమా ! కవులే పునాది లీ
భువనచరిత్ర కెల్లఁ; గవి
పూజ లొనర్చెడు దేశముల్గదే
యవిరతవృద్ధిమై యశము
నందుచునుండుఁ, దదన్యదేశముల్

నవయుచు జీర్ణతం జెడుచు
నాశనదుస్థ్సితి నంతరింపవే ?" 356

"అరయరె ప్రొద్దు నెత్తిపయి
కల్లన వచ్చుట ? నిండ్లు కానరే ?
కలచెదుఁ బిచ్చికుక్క కడ
కాళ్ళను; పిల్లికిఁ బిచ్చిపట్టువోఁ
బెటికెటుగ్రుడ్లు పై కెగిరి
వింటిమి మున్నిటువంటి వెన్నియో
పరిపరిమాటలేల ? గురు
వర్యుఁడు నేఁటి కదృష్టవంతుఁడే." 357

"ఇదికొ, దల్లడియాను;" "కాదదియు, నే
తేదేనిఁ గా నో" నటం
చెదలో నెంచుచు వాదులాడుకొని యా
యేణాక్షులి ద్దేరఁగా
నదనౌటన్ మగుడన్ గృహాభిముఖులై
యానంబు గావింప, నె
మ్మదిగా నేగుచు నిద్ద్వ రాడికొని రి
మ్మాడ్కిన్ రహస్యంబుగన్." 358

"వదినే ! వింటివి మాప్రసంగమును స
ర్వంబుం దటస్థంబుగా

నెదియుంబల్కుప్ప నంగనాచి! యిది నీ
కే కాని యింకేరికిన్
విదితం బౌటకు పిలుసాలెప్పునె? నీ
వేసాలు చాలించు! నె
మ్మది కద్దంబగు నెమ్మొగం బనుట న
మ్మందోఁచు నిన్ జూచినన్." 359

పొరుగింటిదాన వీవై
పరఁగుదువు, కవీంద్రుసతికిఁ బ్రాణప్రియవై
తిరుగుదు, వెఱుఁగవె నీవిది?
యిరుగు రహస్యము పొరుగున కెఱుకవడదఁటే? 360

అరమర యింతయైనఁ గల
దా మనకెవ్వరి కింతదాఁక? యే
పరమరహస్యముం మనము
పంచుక యుండుటలేదె? యిప్పుడీ
తెరతెరచాటులేల మన
తియ్యని నెయ్యమునందుఁ? జెప్పవే
యెఱిఁగినదెల్ల, నెవ్వరికి
నే ననఁబో నని నీవెఱుంగవే? 361

ఎఱిఁగిన దింతచెప్పు మన
నొందులకే మురిపెమ్ము? చెప్పుచోఁ

గొఱవఁబోదు నీదుసిరి;
కూటికి గుడ్డకుఁ గాదు నాకు నే
నెఱిఁగినచో; విచిత్ర మిది
యె ట్లొడగూడెనొ యంచు నామనం
బెరిసెను; శాంతి నొందెదఁ ద
దేకరహస్య మెఱుంగు నంతనే. 362

అని యానెఱజాణ యనన్
విని యాపౌరుగింటిపొలఁతి, వింతగ నగి యి
ట్లనె: "నీతో డోమఱదల!
విని కని యెఱుఁగనిది నాకు వివుచుట కగునే?" 363

గుమ్మము దాఁటిరాదు కవి
కుంజరుఁ డేలెను నింటిగుట్టు స
త్యమ్ముగ; నాకవీశ్వరుని
దారయొ పూసలలోనిదార మ
ట్లమ్మకచెల్ల! తాను జను
నాత్మమనోహరు నద్దుజాడలన్;
బమ్మ కసాధ్య మన్నఁగన
వచ్చునె నా కిఁకఁ దద్రహస్యముల్? 364

ఇంతకుమున్ను వోవునటు
లీయిరుమాసము లేగకుంటి నే

నింతయు వారియింటికిఁ గ
పిశ్వేరుఁ డెప్పుడు నింటనుంటు, నా
యింతియె వచ్చుచుండెఁ జని
యెంచి తటాలున నాఁటి కొక్క-మా
రంతియకాని తాను దడ
యం జన దోరెమి నూనుబాడఁగన్. 365

తనపతి తినుసౌషధమున
కనుపానము వెన్నయనుచు నాకనిసతి దా
ననుదినము వచ్చి మాగి
మునఁగల నవనీత మడిగి పోవుచునుండెన్. 366

ఈ నవనీత మందుకొని
యేమి యొనర్చెనో యింటఁగాని, యా
మానిని రాకమానె నిరు
మానము లేగినవెన్క- వెన్నకై;
దానిఁ దలంచిచూచి కడుఁ
'దర్జనభర్జనఁ' జేయఁజేయ, నా
మానసమందుఁ దోఁచు నను
మాన మొకం డది యాలకింపుమా. 367

అని తనమఱదలి ప్రశ్నింపఁగా
వినిచెను మంత్రోపదేశవిధమును నెదియో
వినిచినయంతన క్రమ్మఱ
ననె నాహారుగింటిపొలఁతి యాత్రమువిూఱన్. 368

"వింటే వింటివికానీ
తంటా నాసఖికి నాకుఁ దగిలింపకు, నీ
వింటింట దీని నాడుచుఁ
గొంటెతన మ్మెట్టియెడలఁ గూడదుసుమ్మా." 369

"పరు లీ మర్మమెఱుంగ నేమియగునే?
వారాశి యుప్పొంగునే?
యురిఁదీయం జనునే నరేశ్వరుఁడు? మా
యోపాయ మొం డొప్పదే
పరిహాసక్రియ? నింతకుం గవికి స
ర్వస్వేచ్ఛ లేఁ డీయఁడే?
యరుదే, యిట్టివినోదసంఘటన లీ
యాస్థానమం దెత్తఱిన్. 370

ఎంచ న్నామ మడంప వైష్ణవమతం
బింతేనియు న్మాయునే

చంచల్లీలయు కాక ? వ్యక్తి లుడుగన్
జల్లాడి చానోపునే
ప్రాంచత్సంస్థలు ? బేల ! హాస్యకృతి కె
వ్వారైనఁ గోపింతురే !
పంచాంగంబును జించునంత గ్రహాసం
పాత్రంబు సంఘిల్లునే ! 371

అని మొన నీల్గుటం ద్రదివ
మందు వసించు తురుష్క ముష్కరుల్
సనకసనందనాది వర
సంయమిఘాలతలోర్థ్వపుండ్రములల్
గినుకను నాకఁజేయు మన
"కృష్ణుఁడు" "మాల్యద" యందు, రామలిం
గనికృతి మేలుకాదొకో వ్యా
గంబాకఁ డాక్రియఁ జేయఁజూచుటన్. 372

నీ వనినట్టు లీకథను
నీ సకియుం గనఁబోయి యుందునో ?
నీ వనఁబోముమో ? యెటులు
నీ సఖి దీని నెఱుంగుఁ ? గాని ప్లోఁ

జావడిలోన నిల్చి జన
 సంఘ మెఱుంగఁగ దప్పుకొట్టి నే
నీవిషయంబుఁ జాటుదునొ ?
 యింతకు నిద్ది యథార్థమౌనఁటే !
అడిగినవారికి మఱి న
న్నడుగనివారలకుఁ దక్క నన్యు లెవరికిన్
నొడువను వదినే !" యనె న
ప్పుడఁతుక పొరుగమ్మఁజూచి పకపక నగుచున్. 374

విరుగఁబడి నవ్వుకొనిరి వారిరువు రంత
నెత్తిపై నీటికడవలు నేలజాఱఁ
బార్శ్వమునను న్న పశుపతి వారిఁ జూచి
పక్కుమని నవ్వె దిక్కులు పిక్కటిల్ల. 375

— స మా ప్త ము —

ఇది శ్రీపరమేశ్వరీ కరుణాకటాక్ష సమాసాదిత కవితావిచిత్ర
భార్గవసగోత్రపవిత్ర శ్రీలక్ష్మీదేవీ వేంకటసోమేశ్వర
సుపుత్ర సకలసుకవిజనవిధేయానంతపంతుల రామ
లింగస్వామి నామధేయ ప్రణీత భువనవిజయా
ఖ్యాక నవ్యకావ్యము సర్వము.



# అంకితము

శ్రీమత్కవికులజలనిధి
సోముఁడు విజ్ఞానధనుఁడు సూనృతఘనుఁడౌ
మామకగురునకు దక్షిణ
గా మత్కృతిపత్రమీయఁ గాంక్ష నెసంగన్.

అసితాక్షములో మేలి హరినీలములో కాని
తళుకార గళసీమఁ దాల్చినాఁడు
నెలిబూదియో వన్నెగల గంధమో కాని
నలువార నెమ్మేన నలఁదినాఁడు
ఎలబిల్వపత్రమో తులసీదళమొ కాని
చెలువారఁ జెవిసందుఁ జేర్చినాఁడు
శివపురాణమ్మొ కేశవపురాణమొ కాని
పొలుపార వలకేలఁ బూనినాఁడు
రామలింగాఖ్యుఁడో లేక రామకృష్ణ
నాముఁడో కాని మన్నన స్నేమయందు
కవితయు న్నత మొకరూపుఁగన్న మాద్రి
నున్నపురుషుండు దోఁచె నాకన్నుఁగవకు.
రామలింగకవీంద్రుఁగా, రామకృష్ణ
నామకవిచంద్రుఁగాఁ దెల్గునాటఁ బేరు

గొన్న మద్గురుమూర్తిని సన్నుతించి
భక్తి గురుదక్షిణను సమర్పణ మొనర్తు.

కడలికి నువ్వుఁగల్లిమట
కానుకగాఁ బరిహాస మందురో!
యుడుత యొసంగలేదొకొ ప
యోనిధి వారధిఁగట్టు రాముచం
ద్రుఁడు గొనఁగాఁ దనూరజము?
దోసమె బత్తినిఁ బత్తి రిచ్చుటె
న్నఁడు? నిట భక్తిఁగాక గణ
నం బొనరింతురె వస్తుమూల్యమున్?

కావున నిస్సంకోచము
గా వినతింజేసి నాదు కావ్యంబును భ
ద్రావాప్తిఁగోరి గురునకుఁ
గోవిదు లౌనన్‌గ నిడెద గురుదక్షిణగన్.

శ్రీకృష్ణదేవరాయా
ఖ్యాకాధిపపోషితాష్టగజనిఖ్యాత
శ్రీకవిగణాగణ్యువరుఁ
డీకవితాశక్తిలబ్ధ దిగ్విజయునకున్.

కవికిన్ గింకవి పర్వత
పవికిన్, పరఘూకభయద భాస్వత్తేజో
రవికిన్, ధృతకీర్తి సిత
చ్ఛవికిన్, సాహిత్యకృతశయనత శాంభవికిన్.

కృతికిన్, నతదాంభిక స
తతికిన్, ధరణీచరద్విఘాత్రాకృతికిన్,
వ్రతికిన్, బుధనుతకృతిని
ర్మితికిన్ మతిచతురతాధరితగీష్పతికిన్.

వాగ్వసురత్నాకరునకు
దిగ్వ్యాసియశఃకరునకు, దేవీప్రాజా
స్రగ్వరధరునకు నిజస
మ్యగ్వంశపయోధిశుంభ దమృతకరునకున్.

అతి నిర్దుష్టకవిత్వ
ప్రతిభాశ్రితునకు, సమస్తరాజకిరీట
స్థితమణిగణఘృణినీరా
జితచరణునకున్, పదార్థసిద్ధిచణునకున్.

జైత్రునకున్, గిరిజాదర
పాత్రునకున్, సుకవివదనవారిజవిలస

న్మిత్రునకున్, శ్రితశతస
చ్ఛాత్రునకును, నాస్తికజనచయ శత్రునకున్.
ముక్తియుతునకున్, హాస్య
సక్తునకున్, సమ్యగాంధ్రజనతాదృతిసం
యుక్తునకున్, శాపాదర
శక్తునకున్, మోక్షమార్గసంసక్తునకున్.

సారతరహృద్య విద్యా
పారావారునకు, నిఖిలపండితనుతధీ
సారునకున్, సారస్వత
గౌరవయుగ్రామలింగ కవిధీరునకున్.

అంకితము "భువనవిజయము"
సంకు సముద్రునకుం బత్రి శంకరునకు, వే
ణాంకునకు నూలుపోఁ గొక
టంకము ధనమున కొసంగుడం బలరారన్.

సర్వే జనా స్సుఖినో భవంతు !



# పండితాభిప్రాయములు

కవిసార్వభౌమ, కలాప్రపూర్ణ, మహామహోపాధ్యాయాంధ్రాస్థానకవీంద్ర బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారొసంగినది.

శ్రీ అనంతపంతుల రామలింగస్వామిగారు రచించిన "భువన విజయ" మను నీ ప్రబంధమును సాకల్యముగాఁ జదివి యానందించితిని. శ్రీ రామలింగస్వామిగారు "శుక్లపక్షము" లోనగు ననేకగ్రంథములు రచించి పేరుగన్నవారు. సరసపరిహాసకావ్యనిర్మాణమునందు వీరిది యందెవేసినచేయి.

ఆంధ్రమునందు హాస్యము ప్రధానరసముగాఁగల కావ్యము లరుదు. అట్టి కావ్యములలో శ్రీ రామలింగస్వామిగారి రచనలు సర్వోత్కృష్టములు. వీరు రచించిన "భువన విజయము" సరసపరిహాసకావ్యములలో నగ్రగణ్య మనవచ్చును. ఇందు శైవవైష్ణవమతసంఘర్షణము వర్ణింపఁబడినది. కాని దీనిలో మతతిరస్కారముగాని వ్యక్తిదూషణముగాని లేదు. వీరి మతము సర్వమతసమ్మతము. మతకలహములు చెలరేఁగు నీ కాలములో నిట్టిగ్రంథము లామతకలహముల నడఁగించి ప్రజల మతమాఢ్యమును బోఁగొట్టఁజాలియుండుననుటకు సందేహము లేదు.

శ్రీ తెనాలి రామలింగకవిని ప్రధానపాత్రముగా గ్రహించి యాతనిచే సర్వమతైక్యమును బోధింపఁజేసి వీరు లోకోపకారము గావించియున్నారు.

ఇది చరిత్రాత్మకమూ, కాక, కల్పనాగాథయూ యను చర్చ యనావశ్యకము. ఇదియొక రసవత్తరకావ్యము. సర్వజన సన్నిహితమగు నొక శుద్ధసత్యమును బరిహాసప్రాధాన్యకముగా లోకులకు బోధించుటయే దీని పరమావధి. సత్యనిరూపణ కిది యొక మంచిమార్గము. ఇట్టి చతురమార్గము నవలంబించి సమర్థతతో సమున్నతాదర్శమును నిర్వహించిన శ్రీ రామలింగ స్వామిగా రత్యంతాభినందనీయులు.

వీరి కవిత్వము నాతికఠిన మృదుమధురంబై, పాత్రోచిత భాషాసమన్వితమై, ధారావాహియై, పండితపామరానందజనక మగు ననుటకు సందేహము లేదు.

శ్రీ రామలింగస్వామిగారు సంఘసంస్కరణోపకారకము లగు మఱికొన్ని హాస్యరసప్రబంధములను రచించి లోకోప కారముం జేయుదురు గాక !

రాజమహేంద్రవరము
30 – 6 – 1954. శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రి

శ్రీమాన్ పండిత కిలాంబి రంగాచార్యులు ఎమ్. ఏ. బి. యల్. గారి యభిప్రాయము.

శ్రీ అనంతపంతుల రామలింగస్వామిగారు రచించిన "భువన విజయ" మను హాస్యరస ప్రధానప్రబంధమును వారే

చదువఁగా విమనన్మృష్టము నాకుఁ గలిగించుటలకు సంతసించు చున్నాను.

సరస పరిహాస కావ్యరచనములో శ్రీ రామలింగస్వామి గారి యద్భుతశక్తికి యిదివఱకే వారి "శుక్లపక్ష" కావ్య మూలమున నాంధ్రలోకమునకు సువిదితము. మృదుమధుర సత్కవిత్వధోరణిలో నాంధ్రభాష నద్వితీయ ప్రతిష్ఠతో నుప యోగించుట వీరిగ్రంథములను జదించువారికి విదితముఁగాక తప్పదు.

ప్రస్తుతకావ్య కథావస్తువు శ్రీకృష్ణదేవరాయల కాల ములోనిది. నిజదిగ్విజయచిహ్నముగా "భువన విజయ" మను పేర నాఁతేఁడు నిర్మించిన యద్భుతసభాభవనమున జరిగిన సంఘ టనము కథావస్తువగుటంజేసి యీ కావ్యమునకు "భువన విజయ" మను నామకరణము చేయఁబడినది.

ఇది చరిత్రాత్మకమా, కాదా, యనువిషయము మన లను బాధింప నవసరములేదు. ఆవిశాలకాలములో దేశము సర్వసమృద్ధమై యున్నపుడు మతవైషమ్యములు ప్రబలు చుండె నని చరిత్రయే చాటుచున్నది. ఆనాఁటిప్రజల మత సంబంధజీవితము నీకావ్యము ప్రశస్తముగా వర్ణించుచున్నది. మతోన్మాదు లెట్టి యపచారములు గావింతురో మతవిద్వేష ములు ప్రజలకెంత యపకార మొనర్చునో, అవి సంఘమున విజృంభించుచో జాతి కెట్టిముప్పు వాటిల్లునో యీగ్రంథమున సుచిత్రితములు. మతోన్మాదులను సరసముగా నధిక్షేపించి సంస్కరించుట కీకావ్యమునఁ బ్రయోగించిన పద్ధతి బ్రహ్మ

ప్రముఖులెం పనిచేయుననుటకు సందేహములేదు. దీనిని బఠించు ప్రతివానుష్యునకుం బరమతసహనమున వలవడు నాత్మశాంత్యానంద వికాసాదు లనుభూతములగుట నిస్సందేహము.

శ్రీ తెనాలి రామలింగకవి దేశములో స్థాపించుకొన్న స్థాన మతిరమ్యముగ నీకావ్యమునం బోషింపంబడినది. ఆకవి చర్యలు కేవలము పుక్కిటిపురాణము లని కొందఱనుకొందురు గాని, యది సత్యముకాదు. ఆంధ్రదేశము చాటుచున్న యాతని యనన్యసామాన్య శేముషీహాస్యరసాద్భుతులను బోషించు టలో శ్రీ రామలింగస్వామిగా రద్వితీయులు.

శ్రీకృష్ణదేవరాయల గురువులైన తాతాచార్యులవారి పాత్ర హృదయంగమముగ నిందు చిత్రింపంబడినది. ఈ వైష్ణవాగ్రేసరుండు సాధారణు లనుకొనునట్లు స్వీయమతమాహాత్మ్య విదగ్ధమనస్కుండుగాక పరమత సహిష్ణుండని యిందుం బొందు పఱుపంబడినది. అది యుక్తమే.

వివిధమతావలంబులు ప్రజలుగాంగలరాజు దేశప్రజా క్షేమమునకై యేరీతిని బరిపాలనము సాగింపవలెనో యిందు శ్లాఘ్యముగా వ్యక్తీకరింపం బడినది.

చక్రవర్తి కేవలము వైష్ణవభక్తుడయ్యుం బరమత సహనమున నానాండంతటివాండు లేండను చరిత్రాంశ మీ కావ్యమున నతిరమ్యముగ వ్యక్తము సేయంబడినది.

సరసపరిహాస కావ్యములు ప్రాపంచిక సారస్వతమునం బ్రత్యేకస్థానము నలంకరించును ఆంగ్లేయ సారస్వతమున నెన్నియో నిట్టి కావ్యము లున్నవి. కాని, మనసారస్వతమున

సవి మృగ్యములు. విద్వాంసులు "చంద్రరేఖా విలాపము" నీసందర్భమునఁ జెప్పవచ్చును. కాని, యది యశ్లీలపద కలుషితమై యుండుటచేసి శిష్టులకెంతమాత్రము హృద్యమై యుండదు.

కావ్యరసములు తొమ్మిదింటిలోను హాస్యరసమునకుఁ బ్రత్యేకస్థానముండియున్నను మనపూర్వకవు లద్దానిఁబ్రధాన రసముగా నుపయోగించి నిజకావ్య విరచనమునకుఁ గడంగకుండుట శోచనీయము. పాశ్చాత్య సారస్వతపరిచయమున నిప్పుడు మనము సరసపరిహాస కావ్య ప్రాశస్త్యమును విశేషముగా గుర్తించుచు మన సారస్వతము లిద్రసన్యూనమై యుంటకు విచారింపవలసి వచ్చుచున్నది.

సరసపరిహాసకావ్యములు మనుష్యుల భావాలలో నెట్టి మార్పులు గావింపఁగలవో సాంఘికజీవితము నెట్లుసంస్కరింపఁ జాలెడునో, దేశపరిపాలనాపద్ధతి నెట్లు తీర్చి దిద్దఁగలవో పాశ్చాత్యసారస్వతము మనకు రుజువు చేయుచున్నది. "జాన్ స్విఫ్ట్ జాన్" అనునవల యూరోపుఖండమున "షివలరీ" యను ప్రవృత్తిలో నెలకొన్న వైపరీత్యములను బయటఁబెట్టి సరసముగా నధిక్షేపించి యణఁపఁగలిగినది. ఆరీతినే సారస్వతవిరచనమున, మతప్రచారమునఁ, బరిపాలనావిధానమున రేకెత్తిన దురాచారములను సమర్థముగాఁ జయప్రదముగా సంస్కరింపఁ జాలిన సరసపరిహాసకావ్యము లనేకములు పాశ్చాత్యసారస్వతమున విరాజిల్లుచున్నవి.

మనసారస్వతమందలి యట్టికొఱంతను దీర్చుటకుఁ బూనుకొనిన శ్రీ రామలింగస్వామిగారి ప్రయత్నము ప్రశంసా

పాత్రము. మనుష్యుల మానసములను గిలంచి, కరఁగించి, పూకరించి యెవ్వరికైన నొప్పిగలిగింపక చమత్కారముగా సంస్కరించి సవ్యమైన సవ్యమార్గములోనికిఁ ద్రిప్పఁజాలు సరస పరిహాస తేజము శ్రీ రామలింగస్వామిగారి విశ్రుతలేఖనీముఖమున బహిర్గతమై విద్యుద్దీప్తిని వికసించి విజృంభించుచున్నది.

అతిసమర్థుఁడైన రచయితకాని నిశితమైన యీ యాయుధము నుపయోగింపనేరఁడు. అసమర్థుఁ డద్దాని వాడఁబో నది బాలునిచేతిలోఁ గరవాలమువలె నాత్మవినాశకారియగును.

కవి సర్వస్వతంత్రుఁడు. ఐంద్రజాలికునివంటివాఁడు. శూన్యాకాశములో నొక నూతనప్రపంచమును నిర్మించఁగల సమర్థుఁడు. ఏతద్భావానుగుణముగా, సరసపరిహాసభాసురమగు "భువన విజయ" మను నీయపూర్వకావ్యము నసాధారణశక్తిచే సృష్టించి పాఠకలోకమును మెప్పింపఁగల ప్రతిభాసంపదను శ్రీ రామలింగస్వామిగారు ప్రదర్శించినారు.

ఆంధ్రలోక మీకృతిని బఠించి యానందించుఁగాక! కవిగా రిట్టికావ్యములను మఱికొన్నిటిని రచించి యాంధ్రులను గృతార్థులను జేయుదురు గాక!



విజయనగరము
1—6—1954

క. [illegible]లు